

*Chandamama Sept. '47* *Photo by M. Ramakrishna*

అబ్బ! ఎంతబరువు!



స్త్రీకి సంతానం సహజమైన కోరిక






దానిని సఫలత నొందిస్తుంది

లోధ్ర అంతటా వాడుకను



కేసరికుటీరం లిమిటెడ్.

మదరాస్

---

# సంచారి

## తెలుగు వారపత్రిక

ఆంధ్రదేశానికి సంబంధించిన సమగ్రవార్తలను వారం వారం ప్రకటించి తద్వారా ఆంధ్రజాతిని ఐక్యపరిచే ఆశయంతో సంచారి సెప్టెంబరులో వెలువడుతుంది. వేడివేడి వార్తలను మాకు అందించి ఆంధ్రసోదరులు మా ఉద్యమానికి సహకారం ఇవ్వాలని మా ప్రార్థన.

ఆఫీసు:

37, ఆచారప్పన్ వీధి — జి. టి. మద్రాసు

# చదువుకోండి



ఇంకా, ఇంకా, ఎన్నో!


సాలు చందా **5-0-0**

# చందమామ

విడిప్రతి **0-6-0**

పిల్లల మాసపత్రిక


చందమామలో పిల్లల రచనలూ, పిల్లల ఫొటోలూ ప్రకటిస్తాము. చక్కని ఫొటోలు కార్డు సైజులో తీయించి 0-0-9 బిళ్ళతో పంపాలి. ఫొటో ప్రకటిస్తే ఉంచుకుంటాము. లేకపోతే తిప్పిపంపుతాము. అచ్చు పడని రచనలు తిరిగి కావాలంటే కవరుమీద తమ అడ్రసు రాసుకుని బిళ్ళ అంటించి, వ్యాసంతోపాటే మాకు పంపాలి. లేకపోతే మేము తిప్పి పంపలేము. ఉత్తర ప్రత్యుత్తరాలు పెంచి లాభముండదు. ఈ విషయాలు ముఖ్యంగా గమనించి మాకు సహాయపడమని మా ప్రార్థన.


ఆఫీసు:

37, ఆచారప్పన్ వీధి : మద్రాసు 1




సంచాలన: చక్రపాణి

సంపుటి 1 | 5 సెప్టెంబరు 1947 | సంచిక 3

## తెలుగు బిడ్డలారా!

మొన్న ఆగస్టు పదిహేను తారీఖున మీరు అంతా కలిసి స్వాతంత్ర్యోత్సవాలు చేసుకున్నారు. ఆడుకున్నారు; పాడుకున్నారు; ఆనందంతో, ఉత్సాహంతో జాతీయజెండా పుచ్చుకుని ఊరేగినారు!

అయితే అల్లుళ్లూ, కోడళ్లూ! మీకు బానిసత్వమంటే ఏమిటో, దాస్యమంటే ఏమిటో, ఏమీ తెలిసి ఉండదు. మీ అన్నలు, మీ నాన్నలు, మీ తాతలు, మీ అక్కలు, మీ అమ్మలు, మీ అవ్వలు ఎంతోమంది ఎన్నో కష్టాలుపడి, బాధలకు వోర్చి, దెబ్బలుతిని, ప్రాణాలు అర్పించి ఈ స్వాతంత్ర్యాన్ని మీకుగాను సంపాదించి పెట్టారు! ఇక దీన్ని కాపాడుకునే భారం మీమీద ఉంది. కాబట్టి ప్రతివారూ దేశంకోసం ప్రాణం తృణప్రాయంగా అర్పించటానికి ప్రతిజ్ఞ పూనాలి.

పాపలూ! ఈ తెలుగుగడ్డ మీది. ఇదివరకు దీన్ని ఎందరో పరరాజులు ఆక్రమించారు. ఇక ముందు అలా జరగకుండా ఈ తెలుగుగడ్డను రక్షించుకోండి. ఆనాడే మీరు నిజమైన తెలుగుబిడ్డలు.

# ఒ క్క మా ట

[ ఉమాదేవి ]

ఎందాక యిట్టె ఓ, చందమామయ్యా
మబ్బు గుఱ్ఱాన్నెక్కి పారిపోతావు!
నీతోడ నన్నురా నిచ్చినావంటె
అమ్మ నాకిచ్చినా అప్పచ్చులన్ని
దారిబత్తెముగ తెస్తాను నావెంట.

కలువత్త నాకెన్ని కథలు చెప్పింది
కథలు చెప్పూకుంటు కదలిపోదాము.

మాఅన్నయిచ్చేడు మరబొమ్మలెన్ని
గిరగిరా తిరిగేటి కీలుగుఱ్ఱాన్ని
నాన్నగారిచ్చేరు మొన్న పండుగకు
ఈ బొమ్మలన్ని నీ కిచ్చివేస్తాను
నీతోడ నన్నురా నిచ్చినావంటె

చరచరా పొయ్యావు చందమామయ్యా
చెవిపడ్డదా నేను చెప్పేటిమాట!




మనుషులకున్నట్టు కాకులకు అన్న చింతలేదు. అవి ఏదోవిధంగా పొట్ట నింపుకుంటాయి. ఈ పదార్థం అరుగుతుందా, అరగదా అనే విచారంకూడా వాటి కుండదు. ఒకనాడు పాపమెళ్లో ఉండే గాజుపూసలపేరు తెగి గాజు పూసలు కిందపడి దొర్లాయి. పక్కనే ఉండి చూస్తున్న కాకమ్మక్క చటుక్కున ఒకపూస అందుకుని ఎడంగా వెళ్ళి మింగేసింది. ఆ తరవాత కాకమ్మక్క అజీర్తితో చాలా బాధపడింది. ఆ విధంగానే ఒక రోజు కాకిబావ పిల్లలాడుకుంటున్న గోలీ ఒకటి కాజేసి మింగాడు. వాతపైత్యంతో బాధపడ్డాడు. అయితే కాకులు మందులూ మాకులూ అవసరం లేకుండానే ఇటువంటి రోగాలు పోగొట్టుకుంటాయి.

మరొకరోజు కాకమ్మక్క నరసమ్మత్తగారి వంటింటోనుంచి చిటికెడు ఎఱ్ఱకారం కాజేసి తిన్నది. కాకమ్మక్క కళ్ళూ నోరూ భగ్గున మండాయి. "దీని నోరుపడా, డబ్బాలమీద సరిగా మూతలైనా పెట్టుకోదేం?" అని కాకమ్మక్క నరసమ్మత్తని తిట్టుకుంది. కాని తిండి విషయంలో ఇటువంటి తిప్పలు కాకులకు పరిపాటే.

కాకులు సమస్తమైన వస్తువులూ తినటమే కాక, వాటిని అనేక రకాల చోట్ల సంపాదించుకుంటాయి. ఆస్పత్రులూ, కసాయి దుకాణాలూ, మార్కెట్లూ, సత్రాలూ, వీధులూ, పెరళ్ళూ, మధ్యాన్నం వేళల భోజన సమయాల్లో ఆఫీసులూ, ఫాక్టరీలూ—ఎక్కడ పడితే అక్కడ, జనసంచారం ఉన్నచోటనల్లా కాకి తిండి సంపాదించుకుంటుంది.





ఆఖరుకు రైలు స్టేషన్లలోనూ, రైలుపెట్టెల్లోనూ కూడా కాకులు తిండి సంపాదించుకో గలవు. విమానాల్లోనూ స్టీమర్లలోనూ కాకికి గడవదేమో కాని మిగతా అన్నిచోట్లా నిక్షేపంగా జరిగి పోతుంది.

పట్నంలో కుప్పమ్మ అనే ఆడమనిషి ఉంది. ఆవిడ ప్రతిరోజూ మిట్టమధ్యాన్నంవేళ ఫాక్టరీకూలీలకి భోజనాలు తెస్తుంది. కూలీల ఇళ్ళకు పోయి, వాళ్ల భోజనం మూటలన్నీ పోగు చేసుకుని, ఒక తట్టలో పెట్టుకుని, ఆ తట్ట నెత్తిమీద ఒయ్యారంగా నిలబెట్టి ఫాక్టరీకి ఎండలో పడి బయల్దేరుతుంది.

మన కాకమ్మక్క కుప్పమ్మ నెరుగును. కుప్పమ్మ తట్టలో తిండీ పదార్థాలుంటాయనీ కాకమ్మక్క ఎరుగును. అందుచేత ఒక రోజు కాకమ్మక్క కుప్పమ్మ వెంట పడింది. మెల్లిగా తట్టమీద వాలి అందులో ఏమేమి ఉన్నాయో పరీక్ష చేసింది. ఒకగుడ్డ మూటలోనుంచి అప్పడం ఒకటి తొంగిచూస్తున్నది. కాకమ్మక్క అప్పడం ముక్క విరిచి రుచి చూసింది. ఇంతలో మరో మూటలో మాంసంగారె కనిపించింది. అది మూటలో దాక్కుని బయటికి కొద్దిగా కనిపిస్తున్నది.





గట్టిగా లాగితే తప్ప అది బయటికి రాదు. అందుకని కాకమ్మక్క కాళ్లతన్నిపట్టి ముక్కుతోగారెనుగట్టిగా పట్టుకుని ఒక్కగుంజు గుంజింది. ఇంకేముందీ? కుప్పమ్మతట్ట కాస్తా దడబడా కిందపడింది. మూటలన్నీ రోడ్డుమీద చెల్లా చెదరుగా పడిపోయాయి.

కాకమ్మక్క రివ్వున ఎగిరి ఒక చెట్టుమీద కూర్చుంది. కుప్పమ్మ కాకమ్మక్కని తిట్లూ శాపనార్థాలూ పెట్టసాగింది. "ఈ కాకి పడిచావా! దీనిశార్థం పిల్లులికి పెట్టా! దీన్ని ఉండేలుతో కొట్టా!" అని ఎత్తుకుంది కుప్పమ్మ. కాకపోయినా కుప్పమ్మ కేం పొయ్యేకాలం? తట్ట నెత్తిన అంత వొయ్యారంగా పెట్టుకు నడవకపోతే ఒక చేత్తో పట్టుకోకూడదూ? మధ్య, పాపం, కాకమ్మక్కేం చేసిందీ? అన్ని మూటలూ రోడ్డుమీద పడిపోతే కాకమ్మక్కకేం వొరిగిందీ?

అయితే ఈ విధంగా తిట్లు తినటం కాకులకు పరిపాటే. పైకి తిట్టేతిట్లు గాలికెగిరి పోతాయి. అందుచేత కాకులు లక్ష్యం చెయ్యవు. వాటిపనేదో అవి చూసుకుంటాయి. అంతే. కాకమ్మక్క గారె సంపాదించుకుంది. ఇక కుప్పమ్మ ఏమని ఏం లాభం?





కాకమ్మక్క మరోసారి ఇంతకన్నా భలేతమాషా చేసింది. వీధివెంట ఒక కోమటి తినుబండారాలమ్ముతూ వస్తాడు. వాటిని తట్టలో పెట్టుకుని, తట్ట మీద తీగెలతడిక ఒకటి అడ్డంపెట్టి, తట్ట నెత్తిన పెట్టుకుని, కర్ర ఒకటి దానిమీదిగా ఆడిస్తూ చిన్న పాట పాడుతూ వస్తాడు కోమటి.

"గారెలు, మసాలా వడలు,
చక్కిలాలు, పప్పుండలూ వోయ్!"

కోమటి యుక్తికలవాడు. కాకులను చేరనివ్వడు. తట్టమీద తీగెలతడిక కప్పాడు, చేతిలో కర్ర పట్టాడు. కాని కాకమ్మక్క ఇంకా యుక్తికలది. తన తోటి కాకిని కోమటి మీదికి పంపకం చేసింది. కాకమ్మక్క స్నేహితురాలు కోమటి చంకకిందిగా ఎగురుతూ పోయింది. దాన్ని భయపెట్టటానికి కోమటి కర్ర దించాడు. ఇంతలో కాకమ్మక్క కోమటి తట్టమీది తీగెలతడిక ముక్కున కరుచుకుని పారిపోయింది.

కోమటి తట్టను పక్కఇంటి అరుగు మీద పెట్టి అక్కడ పడుకుని ఉన్న తాతను చూస్తుండమని కాకమ్మక్క వెంట పరిగెత్తాడు. కాకమ్మక్క దూరంగా వెళ్లి తీగెలతడిక పారేసి చప్పున అరుగుమీద తట్ట దగ్గిరికి తిరిగి వచ్చింది. ఒక పప్పుండ భోంచేసింది. మసాలా వడలన్నీ చిందర వందర చేసింది. ఒక చక్కిలం పట్టుకుని నిష్క్రమించింది.

కోమటి తిరిగివచ్చి తన తట్ట తారుమారై ఉండటం చూసి ముసలి తాత చేసిన పనేననుకున్నాడు. తాతకూ కోమటికీ మాటలు పెరిగి పోట్లాట కిందికి దిగింది. చుట్టుపక్కల వాళ్లంతా పోగై పోట్లాట బాగా రెచ్చగొట్టారు. మనుషులు పోట్లాడుకుంటే కాకమ్మ సొమ్మేం పోయిందీ? మనుషులు పోట్లాడితే కాకికే లాభం.



# విఘ్నేశ్వర ప్రార్థన

●

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్న వదనంధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే.
సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణికః,
లంబోదరశ్చవికటో విఘ్నరాజో వినాయకః.
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః,
వక్రతుండ శ్శూర్పకర్ణ హేరంబ స్స్కంధపూర్వజః.
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి,
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా.
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే.

తుండము నేకదంతమును తోరపుబొజ్జయు వానుహస్తమున్
మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపుల మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరినవిద్యలకెల్ల నొజ్జయై
యుండెడు పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్.



# నా ఆత్మ కథ

చందమామ

కథకు కాళ్లు, ముంతకు చెవులు ఉంటే. నాకు అంటగడుతున్న నిందలు, పక్కిటి పురాణాలుకూడ నిజమే. నా మీద లేనిపోని అపనిందలు కొన్ని వేశారు. అవి నిజమైనవైతే నేను చెప్పకుండా దాచాలి. అవి నిజంకావు. అందువల్ల ఆ అపనిందల్లో ఒకదాన్ని గూర్చి మీకు చెబుతాను.

ముఖ్యంగా వినాయకచవితి కథ తీసుకోండి. ఆనాడు వినాయకుణ్ణి పూజించకుండా నాముఖంచూస్తే నిందలు వస్తాయట. వినాయకుని పూజిస్తే పూజించవలసిందే. దానికి ఎవరు కాదంటారు? కాని అతన్ని పూజించకపోవటానికీ, నాడు నన్నుచూస్తే నింద రావటానికి సంబంధమేమిటి?

"కాదు సంబంధంఉంది. ఆనాడు వినాయకపూజ చేయకుండా నీముఖం చూడటంవల్లనే నింద వచ్చింది", అని కొంతమంది పౌరాణికులు అంటారు. వారుచెప్పేకథకూడ నేనే చెప్పివేస్తాను.

సత్రాజిత్తు సూర్యునిమెప్పించి శమంతకమణి పొందాడు. దాని కాంతి అంతా యింతా కాదు. రెండో సూర్యుడులాగా ఉంటుంది, అంతేకాదు.రోజుకు ఎనిమిది బారువులబంగారంఇస్తుంది.కృష్ణుడు తన కామణియిమ్మని సత్రాజిత్తునుఅడిగాడు. అతడు వల్లకాదంటే వల్లకాదన్నాడు. కృష్ణుడుఅడిగిన కొన్నినాళ్లకుసత్రాజిత్తు తమ్ముడైన ప్రసేనుడు శమంతకమణిని మెళ్లోవేసుకొని వేటకువెళ్లాడు.

అడవిలో ఒకసింహం అకస్మాత్తుగావచ్చి అతన్నిచంపి ఆమణిని నోట కరచుకొని వెళ్లబోతూవుంది. ఇంతలో జాంబవంతుడు ఆ మణినిచూచి ఆశపడ్డాడు. వెంటనే సింహాన్ని చంపి మణిని పట్టుకొనిపోయి గుహలో తన బిడ్డల ఉయ్యాలతొట్టికి కట్టాడు.



ఈ సంగతి తెలియని సత్రాజిత్తుకు అనుమానంకలిగింది. "కృష్ణుడు మణి యిమ్మని అడిగాడు. అడిగి ఎన్నో రోజులు కాలేదు. తమ్ముడు కనిపించటం లేదు. మణి కనిపించటం లేదు. ఇది తప్పక కృష్ణుడి పనే కావాలి," అనుకొన్నాడు. అనుకొన్నవాడు ఊరుకోవచ్చునా. నలుగురైదుగురు దగ్గర ఆ కాస్త అనుమానం వెళ్లబెట్టాడు.



ఈవార్త మెల్లగా కృష్ణునికిచేరింది. ఈ అపనింద పోగొట్టుకోటానికి అతడు మణికోసం బయలుదేరాడు. అడవిలో ప్రసేనుని శవం కనిపించింది. ఆప్రక్కనే సింహంకాలి నెత్తురు జాడలు కనిపించాయి. వాటినిబట్టి పోగాపోగా ఒక గుహ



ముందు సింహం చచ్చిపడి ఉంది. కృష్ణుడు ఆ చుట్టుపట్లు పరిశీలించి చూచాడు. గుహలోనుంచి కాంతి సన్నసన్నగా బయటికి కనిపించింది.

అతడు నదురు బెదురు లేకుండా తిన్నగా గుహలోకి ఒంటరిగా వెళ్లాడు. అలా లోపలికివెళ్లగావెళ్లగా పెద్ద గది, ఉయ్యాల, దానిపైన వ్రేలాడుతున్న మణి కనిపించాయి. అతడు మణి తీసుకోగానే ఉయ్యాలతొట్టిలోని పాప కెవ్వుమని అరిచింది.

జాంబవంతుడు వచ్చి "ఎవడురా వాడు! పాపడి ఆటవస్తువు కాజేస్తున్నాడు," అంటూ ఒక్కగుద్దుగుద్దాడు. దానితో యిరువురికి యుద్ధం ప్రారంభమైంది. ఆ పిడిగ్రుద్దుల మ్రోతకు గుహ దద్దరిల్లింది. ఇలా యిరవై ఎనిమిది రోజులు యుద్ధం జరిగింది. జాంబవంతుడు అలిసిపోయాడు. అతనికి రామచంద్రుడు జ్ఞాపకం వచ్చాడు. యుద్ధం మానివేసి ప్రార్థన మొదలుపెట్టాడు. కృష్ణుడు నవ్వుతు నిలబడ్డాడు. అప్పటికి అతనికి తెలిసివచ్చింది, కృష్ణుడు రామచంద్రమూర్తి అవతారమని. జాంబవంతుడు ఎరుగక చేసిన తన తప్పు మన్నించవలసినదని వేడుకొన్నాడు. శమంతకమణిని, కూతురైన జాంబవతిని కృష్ణునికి సమర్పించాడు.

జాంబవతీ శమంతక మణులతో కృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు. సత్రాజిత్తునుపిలిపించి జరిగినకథచెప్పి మణి యిచ్చివేశాడు. లేనిపోని అపనింద వేసినందుకు సత్రాజిత్తు నొచ్చుకొని ఆ మణిని, తనకూతురైన సత్యభామను కృష్ణునకు ఇచ్చివేశాడు. నాటినుంచి కృష్ణుడు చెబుతూవచ్చాడు. తన తప్పు లేదట. తన మామ తప్పు లేదట. చవితినాడు నాముఖం చూడటంవల్ల తనకు అపనింద వచ్చిందట. ఇది ఏమి న్యాయమో మీరే చెప్పండి! మామ, అల్లుడు సరిగా ఉండాలి. మధ్య బయటివాళ్ల అల్లరిపడాలి. అసలు కృష్ణుడు ఎలాంటివాడో మీకు తెలుసుగా. బమ్మిని తిమ్మిని, తిమ్మిని బమ్మిని చేసేవాడు. అలాంటివాడిమాట నమ్మి నాకు అపనిందలుకట్టటం చాల అన్యాయం. అసలు కృష్ణుడు అలా చేయటానికి కూడ చాల కారణాలున్నాయి. చదువుకుని పెద్దవాళ్ళయిన తరవాత నిజం మీకే తెలుస్తుంది.






ఒకటోక్లాసు పాసయి రెండోక్లాసులోకి ఎట్లా వచ్చానో నాకే తెలీదు. మా క్లాసు మేష్టారు చెప్పేదాకా నాన్నకూడా ఈ మాట నమ్మలా. బడి తెరిచిన రోజు పెందలాడే వెళ్ళి నేను రెండోక్లాసులో కూర్చున్నా. నామీద ఎక్కి మామిడి కాయలు కోశాడే, ఆ గోపిగాడు నేను కూర్చున్న క్లాసులోకి వచ్చాడు. బెంచి మీద కూర్చున్న నన్ను చూశాడు. గోపిగాడు అయిదో క్లాసుమీద రెండో దండయాత్ర చేయబోతున్న సంగతి బడిపిల్లలందరికీ అదివరకే తెలిసిపోయింది. ఎట్లాగయినా నేను పాసయిన వాణ్ణీ, వాడు తప్పినవాడూనూ. అందుకని గోపిగాడివంక గర్వంగాచూశా.

గోపిగాడు గొప్పగా చేతులు పంట్లాము జేబుల్లోపెట్టుకుని, "ఈ క్లాసులోకివచ్చి ఏమని కూర్చున్నావురా? ఎవ్రడా నిన్ను పాసుచేసిందీ?" అని అడిగాడు. వాడిపంట్లాము చూస్తే నాకు నవ్వొచ్చింది. అది వాడిదికాదు. వాడి అన్నదో, వాడి బాబుదో అయి ఉంటుంది. అందుకనే అంత వొదులుగా ఉంది.

"నేను పాసయానని మా మేష్టారు చెప్పార్లే," అన్నా.

"ఏడిచావులే. రైటర్నడిగి కనుక్కునేదాకా నిన్నిక్లాసులో కూచోనివ్వను. పద బయటికి," అంటూ ఆ దుర్మార్గుడు నన్ను బెంచిమీదినుంచి లాగాడు. వాడు బయటికి పొమ్మంటే నేనుపోతానా ఏమిటి? చచ్చినా పోనన్నా. గోపిగాడు మోటుసరసానికి దిగాడు. నన్ను బెంచిమీదినుంచి కిందికిలాగి బయటి వరండాలోకి జరజరా ఈడ్చుకుపోయి అక్కడ వదిలేశాడు. ఈతమాషా




చూడటానికి చాలామంది పిల్లలు చేరారు. "బండ రాముడు రోయ్!" అని కేకలేసి అందరూ నవ్వారు. నాకు పట్టరాని కోపమూ, సిగ్గూ, ఏడుపూ కలిగాయి. రెండో క్లాసులో శుభమా అని అడుగుపెడుతూనే ఇంత అవమానమా? ఏమయినా సరే, నా ప్రాణం పోయినాసరే, గోపిగాడి అంతు కనుక్కోవాలని నిశ్చయించుకున్నా.

మా రెండోక్లాసుకు కొత్త మేష్టార్ని వేశారు. ఆయనపేరు శృంగారం. ఆయన సూటూ,బూటూ వేసుకుని సీటుగా సీమనుంచి అప్పుడే దిగివచ్చిన దొరగారల్లే బడికి తయారయేవాడు. ఆయనకు ఇరవై యేళ్లుంటాయి. చిన్నక్లాసు మేష్టర్లెవరూ ఇన్ని షోకులు చేసుకోరు.



ఈయనను గురించి మిగతా పిల్లలంతా ముందుగానే విన్నారు. అందుచేత ఆయన మొదటిరోజు క్లాసులోకిరాగానే అందరూ లేచి నిలబడ్డారు. ఆయననుచూసి నేను మేష్టరనుకోలేదు. పెద్దక్లాసుచదివే విద్యార్థి అనుకున్నాను. అందుకని నేను లేచి నిలబడలా. కాని మిగతా పిల్లలంతా నిలబడటంచూచి పోనీ గదా అని నేనుకూడా నిలబడదామనుకుంటున్నా.

ఇంతలోనే శృంగారం మేష్టరు నన్నుచూసి, 'వెధవా, బెంచి యెక్కు!' అని ఆజ్ఞాపించాడు.

అసలే గోపిగాడు చేసిన అవమానంతో నేను కుళ్లుతుంటే రెండో అవమానం జరిగింది. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టయింది. కొత్త క్లాసులోకి వచ్చాననే సంతోషమంతా పోయింది. ఇట్లా అన్యాయంమీద అన్యాయం జరుగుతుంటే నోరెత్తటానికి లేదు. నోరెత్తితే దేహశుద్ధి జరుగుతుంది.

నన్ను బెంచియెక్కించి శృగారం మేష్టారు వెంటనే కుర్చీలో కూర్చో





లేదు. ఆయన జేబులోనుంచి రుమాలు తీసి జాగ్రత్తగా కుర్చీ తుడిచాడు. తరవాత కుర్చీఎత్తి నేలమీద రెండు సార్లుకొట్టి, కుర్చీలోనుంచి కింద ఏమైనా పడ్డాయేమోనని చూ శా డు. ఆయన వెతుకున్నదేమిటో మాకందరికీ తెలుసు. నల్లులు! కుర్చీలోనుంచి రెండు మూడు నల్లులు కింద పడ్డ ట్టుం ది. వాటిని మేష్టారు బూటుతో రాచేశారు. ఒక్కసారిగా పిల్లలంతా, "మేష్టారూ, బడి నిండా నల్లులేనండీ!" అని అరిచారు. ఈ అరుపు వినేసరికి మేష్టారుకి కోపం వచ్చింది. 'మీరంతా బెంచీ ఎక్కండి', అన్నారు మేష్టారు. అందరూ గోడ కట్టినట్టు బెంచీలమీద నిలబడ్డారు. నా కళ్ళప్పుడు చల్లగా ఉన్నాయి. అందరూ కూర్చుని ఉంటే ఒక్కణ్ణీ దిష్టిబొమ్మల్లే బెంచీఎక్కటం ఎంతోసిగ్గయింది. ఇప్పుడందరికీ నాగతేపట్టింది. నలుగురితో పాటు నారాయణా. నాకిప్పుడు చాలా బాగుంది.

ఇంతలో క్లాసులు చూసు కుంటూ హెడ్డు మాష్టారు మా క్లాసు పక్కగా వచ్చారు. మా క్లాసుకేసి ఆశ్చర్యంగాచూశారు. పిల్లలందరూ బెంచీలమీద నిలబడటం కనపడింది. శృంగారంమేష్టార్ని బయటికిపిలిచి ఏదో చెప్పి హెడ్డుమేష్టారు వెళ్ళిపోయారు. శృంగారంమేష్టారుక్లాసులోకితిరిగివచ్చి, 'అంతా కూర్చోండి,' అని అరిచారు. గభాలున అం ద ర మూ కిందికిదూకి బెంచీలమీద చతికిలబడ్డాము. బడి తెరిచిన కొద్దిరోజులకు ఒకనాడు మధ్యాన్నం ఇంటికి భోజనానికి వెళ్ళి తిరిగివచ్చా. ఆరోజు చక్కగా మాఅమ్మ నాకో కానీ ఇచ్చింది. అదిపెట్టి బడిదగ్గిర వేరు శనక్కాయలు కొం దా మనుకున్నా. వే రు శ న క్కా య లమ్మేఅబ్బి చుట్టూ







పిల్లకాయలు గుమికూడిఉన్నారు.వాళ్లను తోసుకునివెళ్ళి కానీ వేరుశనక్కాయలు కొనుక్కున్నా. వాటిని భద్రంగా దోసిట్లో పట్టుకుని, ఒక కాయ కొరికి పప్పులు తీసి, పొట్టునలిపి, తింటూ బడిలోకి బయల్దేరా. ఇంతలోనే నా చేతి మీద ఎవరో కొట్టారు. వేరుశనక్కాయ లన్నీ కిందపడిపోయాయి. ఈపనిచేసిన వెధవ ఎవడా అని చూస్తే గోపిగాడే! నాకు భలే కోపంవచ్చింది. తలంతా వేడెక్కింది. అట్లాగే నిలబడిపోయినా.

ఈలోపుగా గోపిగాడు వేరుశనక్కాయలమ్మే అబ్బిదగ్గిరికివెళ్లి తనుకూడా వేరుశనక్కాయలుకొనుక్కుని,దోసిట్లో పట్టుకుని,తిరిగి వచ్చాడు.వాడు నాదగ్గిరికి రాగానే నేను చప్పున వాడి చేతిమీదకొట్టి వాడి డొక్కలో గట్టిగా పోటుపొడిచా. వాడి వేరుశనక్కాయలుకూడా నేలపాలయాయి. నేను డొక్కలో పొడిచిన పోటుకు వెల్లికిలా పడ్డాడు. గోపిగాడు మళ్లీ లేచి నిలబడేలోపల కాలుతో వాణ్ణి నాయిష్టంవచ్చినట్టుతన్నా. గోపిగాడివంటి రౌడీని నావంటి బండవెధవ ధైర్యంచేసి తన్నుతూంటే,వింతచూడటానికి బడిపిల్లలంతా చేరారు. గోపిగాడు లేవటానికి మళ్లీ ప్రయత్నించాడు. ఈసారి వాణ్ణి ముక్కుమీద గట్టిగా తన్నా. దాంతో వాడిముక్కు బెదిరి రక్తం కారటం మొదలుపెట్టింది. నాద్వారిన నేను కింద పడిపోయిన వేరుశనక్కాయలు ఏరుకో సాగా. పక్కనున్న పిల్లలుకూడా నాకు సహాయంచేసి ఏరిపెట్టారు.

గోపిగాడు హెడ్డుమేష్టారి దగ్గిరికి పోయి తనముక్కు చూపించాడు. వాడి ముక్కునకారే నెత్తురుచూస్తూనే హెడ్డు మేష్టారు నన్ను ఈడ్చుకురమ్మని ప్యూనును పంపించారు. నేను వెళ్లేసరికి గోపివెధవ హెడ్డుమేష్టారిముందు దసరా కోతి ఆడినట్టు ఆడుతున్నాడు. నాకోసం హెడ్డుమేష్టారి చేతిలో పేంబెత్తం సిద్ధంగాఉంది. ఎప్పటిమాదిరిగా నోరు మూసుకుంటే నావీపు చిట్లిపోతుందని తెలుసుకున్నా. ధైర్యంచేసి గబగబా హెడ్డుమేష్టారితో గోపిగాడు నన్ను పెట్టిన హింసలన్నీ చెప్పాను. అప్పుడు నా కంత ధైర్యం ఎట్లావచ్చిందో చెప్ప లేను. గోపిగాడు మళ్ళీ నామీద చెయ్యి చేసుకుంటే నేను వాణ్ణి ఎదుర్కొలేను. ఐతేఅదృష్టవశాత్తూ కొద్దిరోజులకే గోపి గాణ్ణి బడినుంచివెళ్లగొట్టారు. వాడిమీద చాలా నేరాలువచ్చాయి. నన్నుమాత్రం బడిపిల్లలు గొప్పగా చూడసాగారు.

# పొట్టి పిచిక కథ

అనగా అనగా ఒకఊళ్లో ఒక రాజు. ఆ రాజుగారికి చాలా అందమైన మహలు ఉంది. దాని కొక పెద్ద గోపురం. ఆ గోపురంలో ఒక పిచిక గూడుకట్టు కుంది. ఈ పిచిక చాలా పెంకి పిచిక. అంతేకాక తెగ వాగుతుంది. అంచేత అందరూ దాన్ని "తెగవాగుడు పిచిక" అంటారు.

ఒకరోజు ఈ పిచికకు గోపురం ముందు కానీ కాసు దొరికింది. అది మిలమిలా మెరుస్తున్న నాణెం. అచ్చంగా బంగారంలాగే ఉంది. పిచిక దాన్ని ముక్కుతో పట్టుకొని ముచ్చటగా తెచ్చుకుంది. అటుతిప్పి ఇటుతిప్పి "ఆహా! నా బంగారుకాసు" అంటూ ఉప్పొంగి పోయింది.

పట్టలేని ఆనందంతో పిచిక గెంతు లేస్తూ నాట్యంచేస్తూ ఇలా పాడింది:

తళతళా మెరిసేటి బంగారుకాసు
మిలమిలా మెరిసేటి మేలైనకాసు
దొరికింది దొరికింది బంగారుకాసు
దారిలో దొరికింది బంగారుకాసు
మిలమిలా తళతళా మెరిసేటికాసు!

చుట్టుపక్కల ఉన్న పిచికలన్నీ ఈ పాటవిని గుంపులుగావచ్చి సంతోషంతో గెంతుతూ పాడడం మొదలుపెట్టేయి.

గోపురానికి దగ్గరగానే రాజుగారి పడకగది ఉంది. పిచికల గొడవతో రాజుగారికి నిద్రాభంగ మయింది. వెంటనే పిచికవద్దనుంచి నాణెం తీసుకొమ్మని రాజుగారు మంత్రికి ఉత్తరు విచ్చారు. మంత్రి ఈ ఆజ్ఞను సేనాధి



ఇంత గొడవ చేసింది'' అని దాన్నొకమూల పారవేసి "ఇక పిచిక అల్లరి చెయ్య" దను కొని నిద్రపోవడానికి పడుకున్నాడు.

తెగవాగుడు పిచిక గడుసుదేగాని సేవకుడు నాణాన్ని లాక్కున్నప్పుడు ఏమీ చెయ్యలేక పోయింది. మిగిలిన పిచికలన్నీ ఏం ప్రమాదం వస్తుందో అని పారిపోయాయి. పిచిక ఒక్కత్తే ఉండిపోయింది.

రాజుగారు మాంఛి గాఢ నిద్రలో ఉన్నారు. అంతట్లో పిచిక మళ్ళీ గెంతుతూ పాడడం మొదలు పెట్టింది.

"మావూరు రాజుకీ మంచి వడ్డీమీద
బంగారు కానొకటి బదులిచ్చినాను!
బదులిచ్చినాను నా బంగారుకాసు!"

ఈపాట వినగానే, ఇదివరకు పారిపోయిన పిచికలన్నీ మళ్ళీవచ్చి ఆడుతూ పాడడం మొదలుపెట్టాయి. మళ్ళీ రాజుగారికి నిద్ర చెడి పోయింది. రాజుగారికి ఎక్కడాలేని కోపం వచ్చింది. వెంటనే పిచికను తనదగ్గరకు తీసుకు రావలసిందిగా మంత్రికి ఉత్తరువుచేశాడు. మంత్రి సేనాధిపతికీ, సేనాధిపతి సేవకుడికీ ఈ ఉత్తరువు అందజేశారు. సేవకుడు

పతితో చెప్పగా సేనాధిపతి తన సేవకుడితో నాణెంతీసుకురమ్మని చెప్పాడు.

సేవకుడు గోపురంఎక్కి పిచిక ముక్కునుంచి నాణాన్ని లాక్కొని సేనాధిపతి కిచ్చాడు. సేనాధిపతి దాన్ని మంత్రికిస్తే మంత్రి దాన్ని రాజుగారికిచ్చాడు. రాజుగారు దాన్ని అటూ ఇటూ తిప్పిచూసి, "అబ్బే! ఇంతాచేస్తే ఇది రాగినాణెం. దీనికేనా పిచిక



చిత్తం అని వెళ్లి గోపురం ఎక్కి పిచికను పట్టుకొని సేనాధిపతి కిచ్చాడు. సేనాధిపతి ఆ పిచికను మంత్రికిస్తే మంత్రి దాన్ని రాజుగారి కిచ్చాడు.

రాజుగారు తక్షణం వంటవాడిని పిలిపించి "ఈ పిచికను తోటలో పాతిపెట్టు"మని అన్నాడు.

వంటవాడు పిచిక కాలి కొక తాడుకట్టి తీసుకుపోయి తోటమాలికిచ్చాడు. తోటమాలి దాన్ని నేలలో పాతిపెట్టాడు.

తోటమాలి వెళ్లిపోగానే రాజుగారి కుక్క తాను దాగున్న చెట్టుపక్కనుంచి బైటికివచ్చి పిచికను తవ్వి తీసింది. కుక్కనుచూసి మొదట పిచిక భయంతో వణికింది. కాని అంతట్లోనే ధైర్యం తెచ్చుకొని "కుక్కా! కుక్కా! నన్ను తినేస్తావా యేమిటి" అని అడిగింది.

"ఔను, ఇప్పుడే" అంది కుక్క.

"నా వొళ్లంతా మట్టితో నిండివుంది. నా రెక్కలు తడిసిపోయాయి. ఈ మట్టిని వదుల్చుకొని నారెక్కలు ఎండబెట్టుకోనియ్యి. అప్పుడే నువ్వు తినడానికి రుచిగా ఉంటాను" అంది పిచిక.

"సరే. వేగం ఆ మట్టి తుడుచుకొని రెక్కలు ఎండబెట్టుకో" అని తొందరపెట్టింది కుక్క.

పిచిక మట్టి దులుపుకుంటున్నట్లుగా ఒక గెంతు గెంతింది. ఒళ్లంతా దులుపుకొని ఇంకో గెంతువేసి రెక్కలువిదిల్చి ఆరబెట్టుకుంది. తర్వాత మరి కొంచెం దూరం గెంతి తుర్రుమని ఎగిరింది.







ఎగిరి ఎగిరి పిచిక రాజుగారు నిద్ర పోతున్న మందిరం దగ్గరకే వచ్చింది. దాన్ని తరుముకుంటూ, అరుచుకుంటూ అక్కడకే కుక్కకూడా వచ్చింది. కుక్క అరుపులకి రాజుగారికి మళ్ళీ నిద్రాభంగమైంది. రాజుగారు చాలా కోపంతోలేచి ''కుక్కను చంపండి. కుక్కను చంపండి'' అన్నారు.

ఇదివిని మంత్రి అరుస్తూ అక్కడికి వచ్చాడు. రాజుగారు కోపంతో 'మంత్రిని చంపండి. మంత్రిని చంపండి' అన్నారు.

అంతట అరుస్తూ పరుగెత్తుకొని సేనాధిపతి వచ్చాడు. 'సేనాధిపతిని చంపండి. సేనాధిపతిని చంపండి' అన్నారు రాజుగారు.

వంటవాడు కేకలువేస్తూ వచ్చాడు. 'వంటవాణ్ణి చంపండి. వంటవాణ్ణి చంపండి' అన్నారు రాజుగారు.

ఇదివిని తోటమాలి అరుస్తూ పరుగెత్తుకొచ్చాడు. రాజుగారు 'తోటమాలిని చంపండి' అన్నారు.

ఇదంతా పిచిక ఒకమూల దాక్కొని దొంగతనంగా కనిపెడుతూనే ఉంది.

తోటమాలి కేకపెట్టగానే రాజుగారు కేకవేశారు. కుక్క మొరిగింది. మంత్రి అరిచాడు. సేనాధిపతి అరిచాడు. వంటవాడు అరిచాడు. తోటమాలి అరిచాడు. అందరూ అరిచారు.

రాజుగారు ఒళ్లుతెలియని కోపంతో 'అందర్నీ చంపండి' అన్నారు.

ఇదంతాచూసి పిచిక ఇలాపాడుతూ ఎగిరిపోయింది :

"వట్టి పిచ్చివాడు మారాజు!
పనికిమాలినవాడు మారాజు!
బుద్ధితక్కువవాడు మారాజు!
ఇంకెక్కడాలేడు ఇటువంటి రాజు!

కాజేసినాడు నా బంగారుకాసు
భూమిలోపల నన్ను పూడ్చిపెట్టేడు
మంత్రిని చంపమని కేకలేశాడు
సేనాపతిని చంప చప్పట్లు చరిచాడు
వంటవాడినిపట్టి వధచెయ్యమన్నాడు
తోటమాలిని చంపి పారేయమన్నాడు

వట్టిపిచ్చివాడు మారాజు
పనికిమాలినవాడు మారాజు!
బుద్ధితక్కువవాడు మారాజు
ఇంకెక్కడాలేడు ఇటువంటి రాజు"

అని పాడుతూ పిచిక "ఇటువంటి బుద్ధిలేని రాజుగారి రాజ్యంలో ఉండకూడ"దని ఎగిరిపోయింది.



రాజుగారు నిష్కారణంగా కోపం తెచ్చుకున్నందుకు చాలా విచారించారు. పిచికకూడా తన నోటి దురుసుతనం మానుకోవాలని గ్రహించింది. అప్పటి నుంచి పిచికా సుఖంగా బదికింది. రాజుగారుకూడా సుఖంగా బదికారు.





న మో ప తా క!
నమోపతాక - నమోపతాక
వీరపతాక - ధీరపతాక
వీరులధీరుల - విజయపతాక!
కర్మవీరుల కదనభూమిలో
అఖిల దేశముల కాదర్శమ్ముగ
ధర్మప్రబోధము చేయుపతాక
శాంతినిచాటే క్రాంతిపతాక
నమోపతాక నమోపతాక
వీరపతాక - ధీరపతాక
వీరులధీరుల - విజయపతాక!
సుంకర రామమోహనరావు,
గుంటూరు.



పిల్లలారా!

ఈచిత్రం ఏమిటో మీ అందరికీ తెలుసు. ఇది మన జాతీయ పతాక. గడచిన ఆగస్టు **15** తేదీన మీరంతా ఈ జాతీయపతాక పట్టుకు తిరిగారు; చొక్కాలమీదా టోపీల మీదా ధరించారు. ఆరోజున మనదేశంలో ఉన్న ప్రతి కచ్చేరీమీదా, అనేక షాపుల మీదా, ఇళ్ళమీదా, వీధుల్లో తోరణాల మీదా అనేక కోట్ల జాతీయ పతాకాలు ఎగిరాయి. ఎందుచేతనో తెలుసా? ఆనాడు మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అంటే ఆనాటినుంచీ మనని మనమే పరిపాలించు కునే హక్కు సంపాదించాం. అందుచేతనే ఆనాడు ఈ మన జాతీయ పతాకకు మనమేకాక మన దేశంలోఉన్న ఇతర దేశాల రాయబారులూ, మన గవర్నరు జనరలు మొదలైన తెల్లదొరలూ వందనాలు చేశారు.

మనకు రాజకీయంగా స్వతంత్రంవస్తే అందరూ మన పతాకకు ఎందుకు వందనాలు చెయ్యాలి? ఈరెంటికీ సంబంధం ఉన్నదా? ఉన్నది. ఈ పతాక మనదేశంలో ఉన్న ప్రజలందరి తరఫునా రాజ్యాంగ ప్రతినిధి. అంతటా నిండిఉన్న భగవంతుడికి నమస్కారం చెయ్యాలంటే మనం దేవాలయానికి వెళ్లి అక్కడి విగ్రహానికి నమస్కారంచేస్తాం. అదేవిధంగా మన దేశంలో ఉన్నవారందరియెడలా స్నేహ భావమూ, గౌరవమూ, భక్తీ చూపాలంటే మన పతాకకు వందనంచేస్తారు. అందుకనే బ్రిటిషువారు ఇక్కడ పాలిస్తూఉన్న రోజుల్లో మన నాయకులు స్వాతంత్ర్యం కోసం ఉద్యమాలు నడిపినప్పుడు మన వాళ్ళు మన పతాక ఎగరవేస్తే బ్రిటిషు అధికార్లు ఆ పతాకను తీసివేశారు. బ్రిటిషు అధికార్లు మన పతాకకు అవమానంచేసి నప్పుడు మన దేశంలో వారందరికీ అవమానం చేసినట్టయింది. అందుకనే వారు మన పతాకను అవమానించటం మనం సహించలేకపోయాం.







ఐతే మనదేశంలో అనేక రాష్ట్రాలున్నాయి. అనేక భాషలు మాట్లాడేవారున్నారు. అనేక మతాలవారున్నారు. అనేక కులాలవారున్నారు. కాని ఈ జాతీయ పతాక ఇందులో ప్రతి వొక్కడికీ ప్రతినిధి. మన ఆంధ్రులకు వేరే పతాక ఉన్నది. అది అరవవారికీ, బెంగాలీవారికీ, మరాఠీ వారికీ, మరెవ్వరికీ ప్రతినిధి కాదు. వొక్క తెలుగు మాట్లాడేవారిదే. కాని ఈ జాతీయ పతాక అట్లా కాదు. భారత రాజ్యాంగ పరిపాలన కిందఉన్న ప్రతి వొక్కడికీ ఈ జండా ప్రతినిధి. మనదేశంలో ఉన్న శ్రీమంతులూ, ఉద్యోగులూ, నిరుద్యోగులూ, స్త్రీలూ, పిల్లలూ, దరిద్రులూ, నిర్భాగ్యులూ, కుంటివాళ్లూ, గుడ్డివాళ్ళూ, అనాథలూ అందరూ ఈ పతాక కిందివాళ్లే.

మీరు మీదేశంమీదా, దేశ ప్రజలమీదా దేశంలోసాగే పరిపాలనమీదా భక్తి గౌరవాలు చూపాలంటే ఈ పతాకకు భక్తి గౌరవాలు చూపండి మన పతాకకు ప్రపంచమంతటా గౌరవం సంపాదించాలంటే మన దేశంలో ఉన్న ప్రతి వొక్కడూ ఈ పతాకకు గౌరవం చూపటమేగాక దీని గౌరవం నిలబెట్టటానికి అనుకూలమూ ప్రయత్నించాలి. మనంచేసే ప్రతి ద్రోహమూ, అన్యాయమూ ఈ పతాక యొక్క గౌరవానికి కళంకం తెస్తాయి. గడచిన యుద్ధానికి పూర్వం జర్మనీలో నాజీలు వొక పతాక ప్రతిష్ఠాపించారు. ఈ పతాక కింద హత్యలూ, దోపిడీ, మోసమూ, దౌర్జన్యమూ, ద్రోహమూ మొదలైన పనులు చేయబడ్డాయి. అందుచేత ప్రపంచంలో ఆ పతాకకు కాస్తయినా గౌరవం లేకుండా పోయింది.

ఆవిధంగానే ప్రపంచమంతటా బ్రిటిషు వారి పతాక సామ్రాజ్యవాద చిహ్నంగా ఉంటూ వచ్చింది. ఆ పతాకను చూడగానే మనకు బ్రిటిషు ప్రజలలో ఉండే మంచి గుణాలూ, బ్రిటిషు పరిపాలనలో ఉండేచెడ్డగుణాలూకూడా జ్ఞాపకంవచ్చేవి.

మీరెప్పుడూ సాటివాళ్ళ కష్టసుఖాలు ఆలోచించి తోడ్పడండి. ఇతరుల మేలు కోరండి. ఆత్మగౌరవం కాపాడుకోండి. ఇతరుల అన్యాయాన్ని దౌర్జన్యాన్నీ ధైర్యంగా ఎదుర్కొనండి. ఆవిధంగా మన పతాకకు గౌరవం చెకూర్చినవా రవుతారు.



# నమస్కారము

మం. పా. శాస్త్రి.

గాలి వానలలోన కంపించిపోక
కొండదారుల మధ్య కుసులూడకుండ
జారు బురదలలో కూరుకోపోక
మాతాత తోలేడు మా దేశ రథము!
చకచకా చేరేము స్వారాజ్యపురము!
జేజేలు మా గాంధిజీకి వేవేలు.

ఎడుగులో దిగుడులో ఎగదోసి దించి
పెద్ద లెందరొ మధ్య మృతిబొందినారు
వారి యాత్మలకెల్ల వాటిల్ల శాంతి
పరమేశ్వరుని గూర్చి ప్రార్థింతు మెపుడు.

ధర్మ చక్రము మధ్య తళతళా మెఱయ
మూడు రంగులతోడ మురిపాలు గులిసి
మిన్నంటి యెగిరింది మిన్నయై జెండ!

గోపాలకుల బ్రోచు గోవర్ధనముగ
మమ్మెల్ల యపుడు గాపాడు మా జెండ
స్వాతంత్ర్య జెండాకు సాష్టాంగ నతులు.

# స్వాతంత్ర్య స్వప్నం
















1930
ఉప్పు సత్యాగ్రహం
1942
8 ఆగస్టు
క్విట్
ఇండియా
1942
9 ఆగస్టు
ప్రజల తిరుగుబాటు
ఢిల్లీ ఎర్రకోట
1947
15 ఆగస్టు




మర్నాడు మంగలి నక్కభరతం పట్టించాలనుకున్నాడు. ఏవిధంగానైనా నక్క అంతు కనుక్కుంటే తప్ప వాడికోపం చల్లారేటట్టు కనిపించలేదు. అందుచేత మంగలి అరణ్యానికిపోయి అక్కడా, అక్కడా ఉచ్చులువేసి ఇంటికి తిరిగివచ్చాడు.

పాపం నక్కబావకీసంగతి తెలీదు. ఎత్తుకొచ్చిన కోడిపెట్టను ఆరగించి నక్కబావ పొదలమాటున సుఖంగా నిద్రపోయింది. తిరిగి చీకటిపడేవేళకు లేచింది. మళ్ళీ ఆహారంకోసం వెతుక్కుంటూ వచ్చివచ్చి, మంగలి వేసిన ఉచ్చులో ఒకదానిలో పడిపోయింది.

తలవని తలంపుగా మళ్ళీ నక్కబావకు ఆపద సంభవించింది. ఈ ఆపద గడిచి బయటపడటం ఎట్లాగో నక్కబావకు తోచలేదు. ఉచ్చు వదిలించుకోవటానికి నక్క జిత్తులేమీ పనికిరాలేదు.

తెల్లవారగానే మంగలి ఉచ్చులు ఒకటొకటే చూసుకుంటూ వచ్చాడు. ఆఖరుకు నక్కబావచిక్కిన ఉచ్చు కనిపించింది. మంగలిని చూడగానే నక్కబావ పైప్రాణాలు పైనే పోయాయి. ఈ ఉచ్చు పన్నింది మంగలే అయితే తనని ప్రాణంతోటి వదలడు. ఎట్లాగా భగవంతుడా, అనుకుంది నక్కబావ.

“మంగలిమామా, మంగలిమామా! నన్నుపట్టుకుంటే నీకేం వొరుగుతుంది? వాళ్లూవాళ్లూ నామీద చెప్పిన చాడీలు విని ఇంతపని చేస్తావా?” అన్నది నక్కబావ.

“నువ్వు పచ్చిదొంగవు. నా ఆపును నీ పొట్ట బెట్టుకున్నావు. నిన్ను తాట వొలిపించి నీచర్మం ఎండెయ్యకపోతే నేను మంగలిని కాను!” అన్నాడు మంగలి.




"జరిగిపోయిందేదో జరిగిపోయింది, ఇక ఎన్నటికీ నీజోలికి రాను. నన్నువొదిలెయ్యి!" అన్నది నక్కబావ.

"నీడొక్క వాలి కలుచేసినాక అప్పుడు వదిలేస్తాను!" అన్నాడు మంగలి. నక్కబావను ఉచ్చు విడిపించి, ఒక గట్టి గోతంలో



వేసుకుని, దానిమూతి గట్టిగా బిగించి, గోతం భుజానవేసుకుని మంగలి ఇంటికి తిరిగి వచ్చాడు. గోతం ఒకపక్కగా పడేసి, మంగలి పెళ్లాన్ని పిలిచి, "ఒసే, ఈ గోతాన్ని జాగ్రత్తగా చూస్తూ ఉండు. దగ్గరికి వెళ్లేవుసుమా! అందులో ఉన్నదయ్యం ముక్కు పట్టుకుంటుంది" అనిచెప్పి మద్దు కత్తి తీసుకురావటానికిమేదర వాళ్లింటికివెళ్లాడు.

గోతంలో ఏమి ఉన్నదీ మంగలి పెళ్లానికి తెలియలేదు. కాని మొగుడు వద్ద





న్నాడని గోతం చాయలకు పోలేదు. నక్కబావ మంగలిపెళ్లాన్ని మోసం చెయ్యటానికి ఒక చక్కనిఉపాయం ఆలోచించింది.

"మంగలివొదినా, మంగలివొదినా! గోతంమూతి కాస్త గట్టిగా బిగించవూ?" అని అడిగింది నక్కబావ.

మంగలిపెళ్లాం ఉలిక్కిపడి, "ఎవరు నువ్వు?" అని అడిగింది.

"నేను ఒక గంధర్వుణ్ణి. శాపంచేత నేను ఈలోకంలోకి వచ్చాను. మంగలి అన్నయ్య నన్నీ గోతంలోపెట్టి నదిలో పడేస్తే నేను మళ్ళీ మాలోకానికి వెళ్లి పోతాను. మాలోకంలోకి వెళ్ళేవరకూ నన్నెవ్వరూ చూడరాదు. చూసినవాళ్లు అప్సరసలై పోతారు. అందుకని కొంచెం గోతం మూతి గట్టిగా బిగించు, నీకు పుణ్యం ఉంటుంది" అన్నది నక్కబావ.

మంగలిపెళ్ళానికి అప్సరస అయి పోవాలని ఆశపుట్టింది. అందుచేత గబ గబా గోతంమూతి విప్పేసింది. బతుకు దేవుడా అని నక్క గోతంలోనుంచి బయటపడి పిక్కబలంకొద్దీ కాలికి బుద్ధిచెప్పి అరణ్యంలోకి వెళ్లిపోయింది.

మడ్డుకత్తిపట్టుకుని మంగలి తిరిగి వచ్చిచూస్తే, ఇంకేముంది? గోతం ఖాళీ. నక్కదారిన నక్కపోయింది. దిగులుమొహంతో పెళ్లాం కనిపించింది. మంగలి పెళ్లాన్నిపట్టుకు చావతన్నాడు. నక్కబావను హతమార్చందే నిద్రపో నని మళ్ళీ శపథం చేశాడు. నక్కబావ కూడా మంగలి అంతు కను క్కుంటానని శపథంచేసింది. ఈమాటు ఏం జరుగుతుందో తరవాత చూద్దాం.





## ఆడపిల్లల పాటలు

చిట్టి చిట్టి ముత్యాలు
చెట్టుకింద పోశారు
పుట్ట మట్టి తెచ్చారు
బొమ్మరిల్లు కట్టారు;
బొమ్మరింట్లో బిడ్డని కంటే
బిడ్డతలకి నూనెలేదు
అత్తతలకి ఆవదంలేదు
మామతలకి మడ్డేలేదు
మొగుడుతలకి మొదలేలేదు
తన తలకి తౌడేలేదు

సంపాదన:
వింజమూరి వెంకటరత్నమ్మ

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | (1) తె | లు | (2) పు | | |
| | (3) ఈ | గ | | (4) లి | (5) పి | |
| (6) తా | త | | (7) క | | (8) ట్టి | (9) అ |
| టు | | (10) ప | ల | క | | డు |
| (11) క | (12) ల | | ము | | (13) నా | గు |
| | (14) త్రే | (15) మ | | (16) వే | ది | |
| | | (17) ర | ణ | ము | | |

పజిలు జవాబు

## చిక్కు మాట

అబ్బాయిలూ, అమ్మాయిలూ!
నేను నాలుగు అక్షరాల నదిని
1, 4 అక్షరాలు కలిపితే సమాధిని
2, 4 ,, కలిపితే త్రోవని
3, 4 ,, కలిపితే ఒకధాన్యాన్ని
పిల్లలూ నేనెవరు?

చావలి మంగయ్యశర్మ, సర్పాపూరు.
(జవాబు ఈ సంచికలోనే వుంది.)

## నేనెవరో కనుక్కో???

బొడ్డుపల్లి పురుషోత్తం

మా అమ్మ పేరు పాలసముద్రం
మా అక్కయ్య లక్ష్మీదేవి
మా మేనమామ మన్మధుడు
నేను శివుని తలపై ఉండే పువ్వును
నేను దేవతలకు ఆహారాన్ని
నేను కలువ పువ్వులను నవ్విస్తాను
నేను నక్షత్రాలకు రాజును
నేను సూర్యుడికి స్నేహితుణ్ణి

నేనెవరో కనుక్కో???
(జవాబు ఈసంచికలోనే వుంది)




* తులశమ్మ

అమ్మా బంగరు బొమ్మా
నీదొడ్డిలోది తులశమ్మా
నీచెవ్వ్యకు చేరెడు కమ్మా
నీ కమ్మదీసి మాకిమ్మా!

* చందమామ

వెండి లాంతరుబట్టి వేగవచ్చాడే,
చల్లన్ని గాలిలో చందమామయ్యా!
బంగారు తేరుపై పరుగెత్తినాడే,
వెన్నెల్ల జల్లంత వెలిసిపోయిందే!

* వెంకటాద్రి

కిఱ్ఱు కిఱ్ఱు చెప్పులూ
జఱ్ఱీ వల్లెవాటులూ
జంకులేని మాటలూ
వెంకటాద్రి నీటులూ.

ఏటుకూరి రవీంద్రం



* అబ్బాయి

చదువంటె అబ్బాయి చండికేశాడే
బద్దెపలుపా రావె బుద్ధిచెప్పాలె!
చదువంటె పిల్లోడు సంతోషపడునే
కంసాలి రామయ్య కంటెచెయ్యాలె!
పిల్లలారా రండి బళ్లోకిపోయి
చల్లని గాలిలో చదువుకొందాము
విసరు విసరూ గాలి విసరవే గాలి
మల్లెపూవులగాలి మామీద విసరు!

* చేప—ఎఱ్ఱ

వస్తావు పోతావు నాకోసమూ
వచ్చి కూర్చున్నాడు నీకోసమూ!
సగము చచ్చున్నాను నీకోసమూ
సాంతము చస్తావు నాకోసమూ!



## మీకు తెలుసునా?



జిరాఫీ ఎడారులలో ఉంటుంది. అక్కడ భూమిమీద గడ్డిఉండదు. కాబట్టి చెట్ల ఆకులే తిని బ్రతకాలి. అందుచేత అది తన మెడ చాపిచాపి అలా పెంచుకుంది.



పాముకు చెవులులేవు.
ఒంటిమీది పొలుసుల్తో వింటుంది.

# ముత్యాల పిట్ట

ఆ దూది కొండలో
ఆ మబ్బుల బిలములో
దాగున్న చంద్రుణ్ణి
చూశావా?

*

ఆ చందమామలో
నల్లాటి మచ్చలో
ఉన్నాది ముసలవ్వ
కన్నావా?

*

ముసలవ్వ చేతిలో
ముత్యాల పిట్టొకటి
కూ.... యంచుకూసింది
విన్నావా???

కె. సఖా



# నవ్వితే నవరత్నాలు



అనగా అనగా వొక వూళ్లో వొక అవ్వ వుండేది. ఆ అవ్వకు యిద్దరు మనమరాళ్లు. వొకతె కూతురుబిడ్డ, రెండోది కొడుకుబిడ్డ. కూతురుబిడ్డపేరు చండి. కొడుకుబిడ్డపేరు గౌరి. గౌరిచక్కటి చుక్క. కాని అవ్వప్రాణమంతా చండిమీదనే. గౌరి పొడఅంటేనే గిట్టేదిగాదు. పాచిపనిదగ్గరనించి ఇంటి పనులన్నీ గౌరిచేతనే చేయించేది.

వొకరోజున గౌరి భావికి నీళ్లకిపోయింది. అక్కడికి వొక దేవకన్య ముసలిదాని రూపంలో వచ్చి "అమ్మా, అమ్మా, దప్పికగావున్నది. కాసిని నీళ్లు పొయ్యమ్మా" అని అడిగింది.

గౌరి "అలాగే పోస్తాను అవ్వా. వుండు" అని బిందె తీసుకెళ్లి అవ్వకు నీళ్లుపోసింది. ముసలిది సంతోషించి "అమ్మా, నువ్వు మంచి పిల్లవి. నీకు వొక వరం యిస్తాను. నువ్వు మాట్లాడినప్పుడల్లా మాటకు వొక్కొక్క మాణిక్యం రాల్తుంది. ఇక నువ్వు నవ్వావా, నవరత్నాలు రాల్తయ్యి" అని దీవించింది.

గౌరి యింటికి చేరేసరికి రోజూకంటె కొంచెం ఆలస్యమైంది. వాళ్ల అవ్వ తిట్టింది.

"అవ్వా, అవ్వా! నాకు భావిదగ్గిర వొక ముసలిది కనపడి మంచినీళ్లు పొయ్యమన్నది. పోసి వచ్చేసరికి కొంచెం ఆలస్యమైంది" అన్నది గౌరి.

గౌరి యీ మాటలనటమేమిటీ, నోట్లోనించి మాణిక్యాలు టపటప రాలటమేమిటీ వొక్కమాటుగా జరిగాయి. అవ్వకు ఆశ్చర్యంవేసి "యిదేమిటి తల్లీ! మాణిక్యాలు పడుతున్నయ్యే నీ నోటినించి. ఇది నిజమా, కలా?" అని అడిగింది. అవ్వ గౌరిని 'తల్లీ' అని ముద్దుగా పిలవటం యిదే మొదటిసారి.

గౌరి భావిదగ్గిర జరిగిందంతా అవ్వతో చెప్పింది.

"అరే, విచిత్రంగావుందే! అయితే మన చండినికూడా నీళ్లకు పంపాలి" అని అవ్వ చండిని పిలిచి జరిగిందంతా చెప్పి నీళ్లకు పొమ్మని నెట్టింది.

చండి బిందె, చెంబు తీసుకుని వొయ్యారంగా నూతికి వెళ్లింది. మళ్ళీ వెనకటి మాదిరిగానే ముసలిదివచ్చి దాహానికి నీళ్లు అడిగింది.

చండి కోపంతో "పో, పో, దరిద్రపు ముండా! నేను, యిక్కడికి నీకు వూరికే



నీళ్లు పొయ్యటానికి రాలేదు. మా గౌరికి యిచ్చినట్లుగా నాకూ వొక వరంయిస్తే నీకు నీళ్ళు పోస్తాను" అన్నది.

"అలాగే నమ్మా! ఆ వరమే నీకూ యిస్తాను. నాకు నీళ్ళు పొయ్యి" అన్నది ముసలిది.

చండి నీళ్ళు తెచ్చి ముసలిదాని దోసిట్లో పోసింది. చండికి నీళ్ళుపొయ్యటం చేతకాలేదు. ముసలిదాని ముఖమూ, గుడ్డలూ అన్నీ తడిపింది.

ముసలిదానికి కోపం వచ్చి "ఓ, చండీ! నువ్వు మాట్లాడినప్పుడల్లా నీ నోట్లోనించి కప్పలు పడతై. ఇక నవ్వావా, తేళ్ళూ, మండ్రగబ్బలూ, పాములూ పడతై" అని మాయమైపోయింది.

పాపం, చండి యేడుపు మొహంతో యింటికి తిరిగొచ్చింది. అవ్వ ఉత్సాహంతో ఎన్నో అడిగింది; కాని వొక్కదానికీ చండి జవాబు చెప్పదు! అవ్వకు కోపం వచ్చి "దున్నపోతా, ఎన్ని పిల్చినా మాట్లాడవ్. నీ నోటి రత్నాలు రాల్తాయనా" అని ఫెడీఫెడీ రెండుమూడు దెబ్బలేసింది. చండికి కూడా కోపంవచ్చి "ముసలి ముండా. నన్ను కొడ్తావా, పైగా భావికి పంపి...." అన్నది చండి ఈమాటలనడమేమిటీ; కప్పలు నోట్లో నుంచి గబగబ పడటమేమిటి, రెండూ వొక్కసారిగా జరిగినై.

"ఇదేమిటే?" అన్నది అవ్వ.

"యిదే ఆ ముసలిముండ నాకిచ్చిన వరం" అన్నది చండి.

చండి నోటినించి కప్పలు మళ్లీ గబగబ పడినై.



ముసలిదానికి దిగులు పట్టు కుంది. చండిని ఏమిచేద్దామా అని.

ఇలావుండగా, వొక రోజున ఆ దేశపు రాజు కొడుకు అవ్వ యింటి ముందుగా గుఱ్ఱంమీద పోతూ దొడ్లో అంట్లు తోముతున్న గౌరిని చూశాడు. ఆ పిల్లను చూడగానే అతనికి ఆమెను పెళ్లి చేసుకోవాలని బుద్ధిపుట్టింది. అతను ఏకాయకిని యింటికి తిరిగొచ్చి మంత్రిని పిలిచి, "ఫలాని వూళ్లో, ఫలాని యింట్లో వొక చక్కటి పిల్ల వుంటుంది. నువ్వు పల్లకీ, నగలు, గుడ్డలు తీసుకుపోయి ఆ పిల్లను తీసుకొచ్చి నాకు పెళ్లిచెయ్యి" అన్నాడు.

మంత్రి మంచి నగలు, గుడ్డలు, పల్లకీ తీసుకుని ఆవూరు పోయి అవ్వతో రాజుగారి పెళ్లిసంగతిచెప్పి పిల్లని పంపమని అడిగాడు.

అవ్వకు భలే సంతోషంవేసింది. కాని దానికొక దురాలోచన పుట్టింది. గౌరికి బదులు చండిని పంపితే తనపీడ వదుల్తుం దను కుంది. అనుకుని, రాజుగారు పంపినగుడ్డలు చండికికట్టి, నగలుపెట్టి ముసుగు వేసి చండిని పల్లకి ఎక్కించింది. ఎక్కించి చండి చెవిలో "జాగ్రత్త! పెళ్లి అయిందాకా మాట్లాడమాక. ముసుగుకూడా తియ్యబోకు" అని రహస్యంగా చెప్పింది.

మంత్రి చండిని పల్లకిలో రాజుగారి దగ్గరకు తీసుకొచ్చాడు. పెళ్లి ప్రయత్నాలు జరిగినై.

చండి పెళ్లిరోజు వరకూ మాట్లాడకుండా, ముసుగు తియ్యకుండానే జరిపింది. కాని, పెళ్లిపీటలమీద కూర్చున్న తర్వాత తప్పలేదు. పురోహితుడు యేవో మంత్రాలు అనమన్నాడు. చండి మరిచిపోయి అన్నది. అనట మేమిటీ, కప్పలు నోట్లోనించి పడటమేమిటీ వొక్కమాటే జరిగినై. చండికి యిది చూచేసరికి నవ్వొచ్చింది.





పకపకా నవ్వింది. యింకేం, తేళ్లూ, పాములూ, మండ్రగబ్బలు కుప్పలు కుప్పలుగా పడ్డయి. పురోహితుడూ పెళ్లి పెద్దలూ అంతా పారిపోయారు.

రాజు కొడుక్కి కోపంవచ్చింది. పీటల మీదనుంచి లేచి ఎకాయకిని చండి అవ్వ దగ్గరకు పోయాడు. అవ్వ అప్పుడు వంటింట్లో బూరెల బుట్టదగ్గర కూర్చుని మెక్కుతున్నది. అక్కడే గౌరికూడా వంట పనులు చేస్తున్నది. రాజు కొడుక్కి గౌరిని చూడగానే ఆశ్చర్యంవేసింది. "నువ్వు యిక్కడికెట్లా వచ్చావ్?" అని అడిగాడు గౌరిని.

"నేనుకూడా మా అవ్వకు వొక మనమ రాల్నే" అన్నది గౌరి వినయంగా. గౌరి యీమాటలనగానే నోటివెంట రత్నాలు రాలినై.

అప్పుడు రాజు కొడుక్కి అవ్వచేసిన మోసం తెలిసింది. కోపంతో మంత్రిని పిల్చి, "ఈ అవ్వను, దాని మనమరాల్ని తీసికెళ్లి బుర్ర గొరిగించి గాడిదనెక్కించి ఫూరిచుట్టూ మూడుమాట్లు తిప్పి ఊరి బైటికి వెళ్లగొట్టు" అని ఆజ్ఞాపించాడు.

ఈ ఆజ్ఞ వినగానే గౌరికి ఏడుపులోకూడా నవ్వొచ్చింది. గౌరి నవ్వటమేమిటీ, నవ రత్నాలు రాలటమేమిటీ వొక్కసారే జరిగినై. గౌరి అవ్వను, చండిని వొదిలి పెట్టమని బ్రతిమాలింది. రాజుకొడుకు గౌరి మాటప్రకారం వాళ్లని వొదిలిపెట్టాడు. ఆ తర్వాత ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూవేసి అంగరంగ వైభోగంగా గౌరిని పెళ్లిచేసుకున్నాడు.

గౌరి రాజుకొడుకు నూరేళ్ళు బతికి హాయిగా రాజ్యమేలారు.



# నీడ బొమ్మలు

అబ్బాయిలూ, అమ్మాయిలూ,

చూశారా, ఈ బొమ్మలు యెంత తమాషాగా వున్నయ్యో? వీటికి కాయితం, కలం ఏమీ అక్కర్లేదు. ఒక తెల్లని గోడ, ఒక దీపం వుంటే చాలు. ఇలాంటివి రకరకాల బొమ్మలు మీరు వేళ్లముడుస్తూ, చాస్తూ వెయ్యవచ్చు, ప్రయత్నించిచూడండి. మీకూ చాతవుతుంది. వచ్చేనెల "చందమామ"లో యింకా కొన్నిబొమ్మలు నేర్చుకుందురుగాని ముందివి నేర్చుకోండి.



కుందేలు



మనిషితల



ఎగురుతున్న పక్షి



ఒంటె



నీగ్రో పిల్లవాడి తల



ఏనుగ

నక్క

# తల లేని బంట్రోతు



అనగా అనగా ఒక ఊళ్ళో ఒక ఎఱ్ఱచీమ వుంది. ఒకరోజున అది ఏట్లో స్నానానికివెళ్ళింది. స్నానంచేస్తూచేస్తూ పాపం కాలుజారి ఏట్లో పడిపోయింది. అది నీటిలో కొట్టుకుపోయి కొట్టుకుపోయి చివరికి వొక వంతెనకి అడ్డంపడింది. అడ్డంపడటంతోటే యిటునీరు అటు పోకుండా నిలిచిపోయింది.యీప్రమాదం తెచ్చిపెట్టిన దుర్మార్గుడెవడాఅని ఆఊరివాళ్లు కత్తులూ, కఠార్లూ, ఈటెలూ తీసుకుని ఏటి దగ్గిరికి పరుగెత్తుకుంటూ వచ్చారు. వంతెన కడ్డంగా పడివున్న చీమని చూడగానే వాళ్ళకి వొళ్ళు మండిపోయింది. ఎవరిశక్తికొద్ది వాళ్ల కత్తులతో ఈటెలతో చీమక్కగార్ని చీల్చి చెండాడేరు. అప్పటికీ దానిమీద కసిపోని కొంతమంది యోధులు, దానిచర్మం వొలిచి వూరులేని పాటిమీద యెండేసి యెవరిళ్లకి వాళ్లు చేరుకున్నారు.

తెల్లారేసరికల్లా ఆపాటిమీద వేరులేనిగరిక మొలుచుకొచ్చింది. కాళ్లలేనిలేడి అటుపోతూ ఈ గరికని తింటానికొచ్చింది. తలలేని బంట్రోతొకడు కత్తిలేని వర తీసుకుని ఆ లేడివెంటబడ్డాడు. దోవలో వాడికి వాడితాత తద్దినం జ్ఞాపకంవచ్చింది. ఆ చుట్టుపక్కలచూస్తే వాడికి అడుగులేనికుండ కన్పించింది. అదితీసుకుని దాంట్లో రెండు శేర్లుబియ్యం పోసి పొయ్యిపెట్టటానికి రాళ్లకోసం చూచాడు. రెండు రాళ్ళుమాత్రం కనబడ్డయి. మూడోరాయికి బదులు తన మోకాలుబెట్టి వండాడు అన్నం.వాడి ఖర్మంకాలి పోసిన మూడు శేర్లలో రెండుశేర్లు

వై. మనుబ్రహ్మచార్యులు, బెజవాడ.



కాలిపోయినై, వొకశేరు మాడి మసిఅయింది. ఏంజేస్తాడు? ఈమసే వడ్డిద్దామనుకుని బ్రాహ్మణార్థానికి ముగ్గురు బ్రాహ్మల్ని పిలిచాడు. ఇద్దరు రామన్నారు. వొకడు అంతేచిక్కలేదు. సరే తాతతద్దినం ఇలా తగలడింది, యిక వేట ఎలావెలగబెట్తానో అనుకుంటూ లేడికోసం బయలుదేరాడు. అనుకున్నంతపనీ అయింది. గరికమేసి లేడి ఎటో పోయింది! పాపం, కాళ్లీడ్చుకుంటూ కాళీచేతుల్తో ఇంటికిచేరాడు.



మన బంట్రోతుకి మూడు ఎకరాల పొలముంది. అందులో మూడుపుట్లు వడ్లు పండుతాయి. వాటిలో రెండుపుట్లు తాలు, ఒకపుట్టి తప్పలు. ఇక వాడు తినేదేమిటో మీరే ఆలోచించండి.

తాలుపండినా తప్పలుపండినా తాసిల్దారుకు సిస్తు చెల్లించక తప్పేదేముంది! ఆఏడుపండిన పంటకి మన బంట్రోతు మూడు డబ్బులు సిస్తుకట్టాడు. అందులో రెండుడబ్బులు చెల్లలేదు; ఒకటి మారలేదు. తాసిల్దారుకి కోపంవచ్చి 'జుట్టుపట్టుకుని ఈడ్చుకురా వాణ్ణి' అని తన జమానుని పంపించాడు. జమానువచ్చి మన బంట్రోతును పట్టుకుపోయాడు.

తాసిల్దారుగారు బంట్రోతును మూడుగుద్దులు వేయమని ఆర్డరిచ్చారు. కాని మనబంట్రోతు పంటపండి, అందులో రెండుగుద్దులు తగలలేదు. ఒకటి తప్పిపోయింది. బ్రతుకుజీవుడా అని మళ్లీ కొంప చేరుకున్నాడు. వాడికి ప్రతి ఏటా యిలాగే జరుగుతుంటుందిట. చూశారా ఎంత అదృష్టవంతుడో!



## తమాషా మాటలు

ఈ కింది మాటలు ముందునుంచి వెనక్కు, వెనకనుంచి ముందుకు చదివినా అవే మాటలవుతవి.

| | |
|---|---|
| 1. కిటికి | 6. ముదము |
| 2. గంగ | 7. పులుపు |
| 3. మడిమ | 8. కులుకు |
| 4. నటన | 9. మహిమ |
| 5. విరివి | 10. టమాట |

అబ్బాయిలూ ! ఇలాంటి మాటలు కొన్ని మీరూ ఆలోచించండి

హరి సత్యం, ఎర్రుపాలెం

## అన్నీ మానములే

| ప్రశ్నలు | జవాబులు |
|---|---|
| గాలిలో ఎగిరేది ? | విమానము |
| ఇనాము ? | బహుమానము |
| పోలిక ? | ఉపమానము |
| నగుబాటు ? | అవమానము |
| సందేహము ? | అనుమానము |
| నిర్ణయము ? | తీర్మానము |
| సమానము కానిది ? | అసమానము |
| గౌరవము ? | సన్మానము |

రచన: బూదూరి రంగాచారి, గోశీలపాలెం.

## ముగ్గులు



కొడాలి బసవపూర్ణమ్మ

పెదరావూరు



మామిడిపల్లి స్వరాజ్యం

పెదరావూరు




మేనత్త కొమరుడా మేలైన బావా
మానాన్న అల్లుడా మంచి కుఱ్ఱాడా
పండక్కు వచ్చావు దండగేముంది
పండగెళ్ళేదాక ఉండి పోవయ్యా.

సిసలైన భోజనము చేయనూవచ్చు
పసగల తమలమూ వేయనూవచ్చు
చుట్టు జరీపంచ కట్టనూవచ్చు
అక్కతో ముచ్చట్లు ఆడనూవచ్చు

పండక్కు వచ్చావు దండగేముంది
పండగెళ్ళేదాక ఉండి పోవయ్యా.

చీట్ల బియ్యమ్మని సిగ్గుపడబోకు
కంట్రోలు రోజులని కంగారు పడకు
బ్లాకు మార్కెట్టుంది భయమేమిలేదు
అల్లుడి మర్యాద కద్దేమిరాదు

పండక్కు వచ్చావు దండగేముంది
పండగెళ్ళేదాక ఉండి పో బావ!

కనుపర్తి వరలక్ష్మమ్మ




అనగనగా ఒకవూళ్లో పేరాసి పెద్దమ్మవుంది. ఆమెకి నలుగురు కొడుకులు. ఆనలుగురూ వేటకెళ్ళారు.వాళ్ళకి ఓ అడివిపంది కనిపించింది. వాళ్ళని చూసి ఆపంది, "నన్ను చంపకండి. నేను చెప్పేమాట వినండి. ఇక్కడ నాలుగుకుంచాల వరహాలుచల్లాను. నేను నీళ్లుతాగి వొచ్చేలోపల వాటిని మీరు ఎత్తితే నన్ను చంపండి. ఎత్తలేకపోతే నేను మిమ్మల్ని మింగేస్తాను" అంది. "ఓస్. ఇదెంతపని! వెళ్లిరా" అన్నారు వాళ్లు.కాని ఎత్తలేకపోయారు. ఆ పంది వాళ్ల నలుగుర్నీ మింగేసింది.



తనకొడుకులు తిరిగిరాలేదని, పేరాసి పెద్దమ్మ ఏడుస్తో ఓ పచ్చిమిరపకాయని పక్కలో పెట్టుకు పడుకుంది. తెల్లారేప్పటికి ఓ బుడతడు పుట్టాడు ఆమెకి. వెంటనే బుడతడు, 'అమ్మా, నేను వేటకెడతాను' అన్నాడు. 'మీ నలుగురన్నలూ వేటకువెళ్ళి చచ్చిపోయారు. వాళ్ళని అడివిపంది మింగింది. నిన్నూ మింగుతుంది! వెళ్ళవొద్దని ఏడ్చింది ఆ పేరాసి పెద్దమ్మ. కాని బుడతడు ఆమె మాటవినక కత్తితీసుకుని అడివికి వెళ్ళాడు. అక్కడన్నల్ని మింగిన అడివి పంది కనిపించి, "నన్ను చంపకు. నేను నీళ్లుతాగి వొచ్చేప్పటికి నాలుగు కుంచాల వరహాలు ఎత్తితే నన్నుచంపు" అంది. బుడతడు సరేనని దానిముందే నిమిషంలో నాలుగు కుంచాల వరహాల్ని ఎత్తి, పందిని మధ్యకి నరికాడు. నలుగురన్నలూ పంది పొట్టలోంచి బైట







పడ్డారు. బుడతణ్ణిచూసి, అసహ్యపడి గొయ్యితీసి, వాణ్ణి గోతిలో కప్పెట్టారు. కప్పెపెట్టి ఇంటికెళ్లారు. "మీ తమ్ముడేడి?" అని ఏడ్చింది పెద్దమ్మ.

"వాడా? ఆబుడతడా మాతమ్ముడు? వాణ్ణి గొయ్యితీసి గోతిలో పాతిపెట్టేశాము" అన్నారు వాళ్లు. "అయ్యో! ఎంతపొరపాటు చేశారురా! వాడే మీ తమ్ముడు. గొయ్యితవ్వి వాణ్ణి నాకు తెచ్చిపెట్టండి" అంది వాళ్లతల్లి. సరేనని వాళ్లు అడివికివెళ్లి బుడతణ్ణితవ్వి ఇంటికి తీసుకొచ్చారు.



పేర్రాసి పెద్దమ్మ బూరెలు వొండి నలుగురు కొడుకులకిపెట్టి, బుడతడికి మాత్రం పేడబూరెలు వొండిపెట్టింది. బుడతడు నలుగురన్నలదగ్గిర నాలుగు బూరెలు అడుక్కుని హాయిగా తింటూపోయినాడు. దోవలో బూరెలోంచి ఓ శనగపప్పు కిందపడ్డది. ఆ పప్పు మొక్కమొలవాలి అన్నాడు. మొలిచింది. చెట్టు పెరగాలి అన్నాడు. పెద్ద వృక్షమయింది. పువ్వు పుయ్యాలి, బూరెలు పండాలి- అన్నాడు. పండింది. హాయిగా ఆ చెట్టునెక్కి బూరెలు తింటున్నాడు. ఆదోవన ఓ రాజుకూతురు వెడుతోంది. బూరెల్నిచూసి ఆ అమ్మాయికి నోరూరింది. 'నాకోబూరె పెట్టవా' అంది రాచకన్య. "నోటితో పెడితే నోరెంగిలి, కాలుతో పెడితే కాలెంగిలి. కన్నుతో పెడితే కన్నెంగిలి. ఎట్టా పెట్టను?" అన్నాడు బుడతడు. "నీతల వెంటికతో పెట్టు" అంది ఆమె. ఆ తలవెంటికతోపాటు బుడతడుకూడా ఆమెవొళ్లోకి జారి, ఆమె గుర్రంమీద ఆమెవొళ్లో స్వారిచేస్తూ హాయిగా వెళ్ళిపోయినాడు.

బాబు చెపితే 'చలం' రాశాడు యీకథ.



# నేటి పాపలు  రేపటి పౌరులు



ఈ పాపకి చందమామ కావాలి

చి॥ చావలి కామేశం, రాజమండ్రి



"భారత లక్ష్మి"

చి॥ కోనేరు రత్నమాల, ఏలూరు



"గెలుపు నాదే"



సర్కాసు ఫీటు!

# తెనాలి రామలింగం

రామలింగాన్ని గోతిలో కుతికవరకు పూడ్చిపెట్టి యేనుగులచేత తొక్కించమని రాయలవారు ఆజ్ఞాపించారని కిందటినెల చదివారు జ్ఞాపకం వుందా!

సరే, రాయలవారి ఆజ్ఞప్రకారం యిద్దరు సేవకులు రామలింగాన్ని వూరి బయటికితీసికెళ్లి వొక గొయ్యిత్రవ్వి అందులో కుతికవరకూ పూడ్చిపెట్టారు. ఇంకెక్కడ తప్పించుకుంటాడులే అనుకుని సేవకులు రామలింగాన్ని వదిలి, యేనుగుల్ని తీసుకురావటానికి తిరిగి వూళ్ళోకొచ్చారు.

ఈలోగా వొక గూనిచాకలివాడు ఆ దారినవస్తూ రామలింగాన్నిచూసి 'ఇదేంటి బాబయ్యా! యిలా పాతిపెట్టారు తమర్ని. ఎవరుబాబూ మీరు?' అని అడిగాడు.

మన రామలింగానికి వెంటనే వొక వుపాయం తట్టింది. "చాకలన్నా, చాకలన్నా, చెపుతాగాని మరి నాకో సహాయం చేసిపెడ్తావా?" అని అడిగాడు.

"అలాగే బాబయ్యా, అదేదో సెలవిప్పించండి" అన్నాడు చాకలి.

"ఏమీలేదు చాకలన్నా, నాకూ, నీకున్నగూనికి రెట్టింపు గూని వుంది. ఇవ్వటికి పదేళ్ళనించీ బాధపడుతున్నాను ఈ గూనితో. నాఅదృష్టంకొద్దీ వొకవారం రోజులక్రిందట నాకో సాధు కన్పించాడు. నా గూనిచూసి ఆయనకి జాలివేసింది. 'ఒక రెండురోజులపాటు కుతికలోతుగోతిలో కంఠంవరకూ పూడ్చుకుని వుండు. ఆ రెండురోజులు కళ్లుకూడా మూసుకునే వుండాలి. ఏమి జరిగినా కళ్ల తెరవకూడదు. గడువు పూర్తికాగానే నీగూనికూడా మాయమవుతుంది' అనిచెప్పాడు. సరే ఆవాళనించీ ఈగోతిలో పాతుకుని కూర్చున్నా. యివ్వాల్టితో గడువు తీరిపోయింది.



కాస్త నన్ను బయటికి లాగావంటే నా గూని వుందో పోయిందో చూసుకుంటాను" అన్నాడు రామలింగం.

"ఓస్, యిదికూడా వోపెద్ద సహాయమేనా బాబయ్యా. మీగూని పోయిందంటే నేనూ మీలాగే నాల్గురోజుల పాటు కళ్ళుమూసుకుని నా గూని పీడ కూడా వదిలించుకుంటా" అని చాకలి రామలింగాన్ని గోతిలోంచి బైటికి లాగాడు. నిజంగా గూనివున్నవాడైతేగా రామలింగం. మామూలు మనిషిలాగా తయారై బైటబడ్డాడు.

చాకలివాడికూడా గూని పోగొట్టుకోవాలని ఆత్రం కలిగింది. "బ్రాహ్మణ బాబూ! మీకు పుణ్యం వుంటుంది. నన్ను కూడా కాస్త గోతిలోదించి పూడ్చిపెట్టండి. మీరు పోయే దోవలోనే నా యిల్లు వుంది. మా యింటిదానికి ఈ కబురు కాస్త అందించి దాన్ని వచ్చి ఈమూట తీసుకెళ్ళమనండి" అని ఆత్రంగా కోరాడు చాకలివాడు రామలింగాన్ని.

"అలాగేలేవోయ్. నాబాధవంటిదేగా నీదికూడా. కాని మవ్వుమాత్రం ఈ వారంరోజులూ కళ్ళు తెరవకూడదు. ఏమి ప్రమాదం జరిగినాసరే" అన్నాడు రామలింగం.

"ఏదోలేండి బాబూ, ఎలాగో అవస్థపడతాను. ఈపాడుగూని వదిలిపోతే చాలు" అన్నాడు చాకలి.

రామలింగం చాకలివాణ్ణి గోతిలో కంఠందాకాపూడ్చి తనదారిన తాను బయలుదేరి వెళ్లిపోయాడు. పోతూ పోతూ చాకలివాడిపెళ్లాంతో ఈసంగతి చెప్పాడు. చాకలివాడిపెళ్లాం అన్నం మూటకట్టుకుని బయలుదేరింది.



ఈలోపుగా, రాయలవారి సేవకులు ఏనుగులనితీసుకుని రామలింగాన్ని పూడ్చిపెట్టినచోటికి వచ్చారు. అప్పటికి కొంచెం చీకటిపడింది. గోతిలోవున్నది రామలింగమేననుకుని వాళ్ళు యేనుగులచేత తొక్కించారు. కళ్ళుతెరిస్తేగాని పోదేమోనని పాపం చాకలి అలాగే గుట్టుచప్పిడి కాకుండా పూరుకున్నాడు. ఇంకేముందీ, పచ్చడిపచ్చడి అయిపోయాడు. వచ్చినపని అయిందిగదా అని రాయలవారిసేవకులు తిరిగి ఆస్థానానికి చేరుకున్నారు.



చాకలివాడిపెళ్లాం అన్నపుమూటతో వచ్చిచూస్తే యింకేముందీ. మొగుడి తలకాయ ఆనమాలుకూడా లేకుండా పచ్చడిపచ్చడై కనిపించింది. పక్కనే వాడి గుడ్డలమూటచూసి అది తన మొగుడితలకాయే అని తెలుసుకుంది. ఆ మూట నెత్తినేసుకుని లబోదిబోమంటూ రాయలవారి ఆస్థానానికి వచ్చింది.

ఈలోపుగా మన రామలింగంకూడా ఆస్థానం చేరుకున్నాడు. జరిగిందంతా విన్నతర్వాత రాయలవారు 'ఔర పిడుగా, ఎంతపని చేశావ్! నిష్కారణంగా ఏమీతెలియని చాకలివాణ్ణి నీపొట్ట బెట్టుకున్నావుగదా. ఏదోలే, అయిపోయిందేదో అయిపోయింది. నువ్వు తిరిగి మూకళ్ల యెదట బడ్డావ్. అదే పదివేలు' అని చాకలిదానికి మనువర్తి ఏర్పాటు చేసి పంపించారు.






[ తల్లులకు ]



గోరింట పువ్వువంటి కొడుకు నెత్తుకుని
బాలింత వచ్చింది బావినీళ్లాకు
ఏ దేది బాలింత? యెంత చక్కందొ!
మాచిన్ని పట్టుచీర మడమలకు పసుపు,
కళ్లదీ కాటుకా పళ్లదీ యెరుపు,
మావాడ బాలింత అబ్బాయి తల్లి.



ఏటికీ కాలువ యెంతదూరమ్ము
యెత్తి పెంచిన తల్లికెంత మోహమ్ము!
కాలువ నీళ్లన్ని కడు సంద్రమాయె
కడలేని మోహమ్ము కన్నతల్లికి.



ఇంతంత దీపమ్ము యిల్లెల్ల వెలుగు
చుక్కల్ల చందమామ జగమెల్ల వెలుగు
గోరంత దీపమ్ము కొండల్ల వెలుగు
గోపాల కృష్ణమ్ము మందల్ల వెలుగు
మాడంత దీపమ్ము మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు.

---

సంపాదన: దీవి భానుమతీదేవి, కోరుతాడిపర్రు



ఊచకా ఊగదే ఉయ్యాలచేరు
పాడకా నిదరోడు పట్టి అబ్బాయి
విశాఖపట్నాన విసిరింది గాలి
వింజరపు రేవున్న తేలిందివాడ.
వర్తకుడి పేరేమి వాడపేరేమి ?
వాడలోపోసినా దినుసుపేరేమి ?
వర్తకుడు అబ్బాయి వాడ నావాడ
వాడలోపోసినా దినుసు ముత్యాలు.





ఉయ్యాలలో బాల వుగ్గుకేడుస్తే
ఉత్తమ్మ యశోద వూచి వుగ్గొయ్య
పల్లకీలో బాల పాలకేడుస్తే
చల్లనీ మామయ్య, చందమామయ్య
పాలోసి పోవయ్య పసిబాలకీవు.

దేవుడి గుళ్ళోన దేవుడాడేని
దేవేంద్ర సభలోన జూదమాడేని
పరమేశు గుళ్ళోను పాములాడేని
పణతి నానట్టింట బాలలాడేని.





# వేలంవెఱ్ఱి కథ



అబ్బాయిలూ, అమ్మాయిలూ! మీకు ఈ కథ తెలుసునా? పోనీ నే చెప్తావినండి. ఏం. అనగా, అనగా, ఒకవూరిలో, ఒక రాజూ, మంత్రీ వుండేవారు. ఆ మంత్రి పేరు సుబుద్ధి. ఒకరోజున రాజు మంత్రినిపిలిచి, "వేలం వెఱ్ఱి అంటె ఏమిటి" అని అడిగాడు.

మంత్రి ఏమిచెప్పుతాడు? అందుకని రాజుగారితో "రెండు రోజులు గడు వివ్వండి చూపిస్తాను" అన్నాడు. ఆ మర్నాడు పొద్దున్నే లేచి స్నానంచేసి, పీటూడిపెట్టుకుని, వూరి చివర కంచర గాడిదలు వుంటే, వకదానికి మూడు ప్రదక్షిణాలుచేసి, ఒక వెంట్రుకపీకి చెవులో పెట్టుకున్నాడు. ఆగాడిద కల వాళ్లు వూళ్లోవున్న తదితరులు "యేమిటీ బాబూ అలావేశారు" అని అడిగారు.

ఈగాడిద "మధురనుంచి వచ్చింది. దీనికాళ్లు వసుదేవుడు పట్టుకున్నాడు. అందిచేత పుణ్యంవస్తుందని అలా చేశాను" అని మంత్రిఅన్నాడు. ఆమాట వినివూరంతా ఒక్కరొక్కరే వెళ్ళటం మూడు ప్రదక్షణాలుచేసి దాని వెంట్రుక వొకటి పీకి చెవులో పెట్టుకోటం మొదలుపెట్టారు.

ఇల్లా చెయ్యటంతో ఆ గాడిద బొచ్చంతా ఊడి చావుకుసిద్ధం అయింది. ఈ సంగతి రాజుగారికికూడా తెలిసి మనంకూడా చూద్దామని బయలుదేరి వెళ్లి మూడు ప్రదక్షణాలుచేసి ఒక వెంట్రుక పీకినాడు.

దానితో ఆగాడిద చచ్చిపోయింది.ఆ గాడిదకలవాళ్లు, "మాబ్రతుకు ఈగాడిద

కె. దుర్గాంబ, గుంటూరు.



తోనేవున్నది. మీ చేతులలో చచ్చిపోయింది. దీనిఖరీదు ఇవ్వ'' మన్నారు. అప్పుడు రాజు మంత్రినిపిలిచి, ఇదేమిటి ఇల్లావచ్చింది అని అడిగాడు. అప్పుడు మంత్రి అన్నాడుకదా! ''మీరు వేలం వెఱ్ఱి అంటె యేమిటని అడిగారు. దానికి నోటితో సమాధానంచెపితే మీకు నచ్చేది కాదు. అందుకని ప్రత్యక్షంగా చూపిస్తే తెలుస్తుందని ఇలా చేశాను'' అని అన్నాడు. రాజు, మంత్రితెలివికి సంతోషించాడు.

గాడిదవాళ్లకు కొంత సొమ్ము ఇచ్చి వాళ్లను పంపించేశారు.

కథ కంచికి, మనం ఇంటికి.



# పొడుపు కథలు

(1)

తల్లిమూపుపైన తనయుని గొంపోవ
దారి దొంగజూచి వారిజంపి
వండి కూరచేసి 'వహ్వా' యటంచును
నాపె పైటలోనె యారగించె!

(2)

పదము లెనిమిదెన్నపతగ కొమ్ములు నాల్గు
నడ్డముగ నడచు నసురగాదు
శిరము తోకలేదు జీవంబు దనరును
యిందు భావమేమి 'చందమామ'

★

వి. వి. సత్యనారాయణ రెడ్డి
తాళ్లముదునూరుపాడు

(3)

మొదలు కాయలుండు, పిదపను మ్రానుండు
మ్రానుపైని లతలు వ్రేలుచుండు
లతలమీద వ్రేళ్లు అతిగ ప్రాకుచునుండు
యిందు భావమేమి 'చందమామ'

★

వేదాంతం అనసూయాదేవి
గుంటూరు

జవాబులు 61 వ పేజీలో చూడండి.

---

33 వ పేజీలోని "నేనెవరో కనుక్కో"
అన్నదానికి జవాబు 'చందమామ'

---

33 వ పేజీలోని చిక్కుమాటకు జవాబు
'గోదావరి'

---

56 వ పేజీలోని 'బొమ్మలో బొమ్మ'కి జవాబు
వేటకాడు చిలక కాళ్లక్రిందనే వున్నాడు.



# బొమ్మలో బొమ్మ



ఒక చిలకా వేటకాడూ కలిసి ఎంతో స్నేహంగా ఉంటున్నారు. ఇందులో వేటగాడు చిలకను పిడిపించటానికి దాక్కున్నాడు. మీరు వాడు ఎక్కడ ఉన్నాడో కనుక్కుని చిలకకి చెప్పండి. లేదా జవాబుకు 55 పేజీ చూడండి.



స్వాతంత్ర్య దినోత్సవంనాడు మద్రాసు ఆలిండియా రేడియోవారి పిల్లల కార్యక్రమంలో పాల్గొన్న పిన్నలు పెద్దలు.

# బాబు రాజేంద్రప్రసాద్



కాంగ్రెస్‌నాయకులకు జేజేలు కొట్టేటప్పుడు బాబు రాజేంద్ర ప్రసాద్ పేరు మీరువినేఉంటారు. ఆయనకథ మీకు తెలుసునా?

బాబు రాజేంద్రప్రసాద్ తాత మిశ్రీలాల్‌గారు. పెదతాత చౌధురీ లాల్‌గారు. తండ్రి మహదేవ్ సహాయ్‌గారు; అన్న మహేంద్ర ప్రసాద్‌గారు. జన్మస్థానం బీహారులోని జిరాదేయి అనేగ్రామం.

బాబు రాజేంద్రప్రసాద్‌కు చిన్నప్పటినుంచి ఒక అలవాటు ఉండేది. ప్రొద్దుగ్రుంకటం ఆలస్యం, గుర్రున నిద్రపోయేవాడు. ఒక్కొక్కప్పుడు అన్నం తినకుండాకూడా పండుకొనేవాడు. తల్లి ప్రేమతో మంచంమీదినుంచి ఎత్తుకొనివచ్చి అన్నం పెట్టేది. ఒకప్రక్క నిద్రపోతూనే అన్నం తినేవాడు. ఇలా పెందలాడే నిద్రపోయే అలవాటు ప్లీడరుపనిచేసే రోజులలోకూడా పోలేదు.

## మహా పురుషుల జీవిత చరిత్ర

ఒకమాటు ఆయన ప్రొద్దుపోయే దాక మేలుకొందామని ప్రయత్నించాడు. రాత్రి నిద్రవస్తున్న సమయంలో పుస్తకం చేతిలోపట్టుకొని నిలబడ్డాడు. కాని నిద్ర ఆగలా. విరుచుకు కిందపడ్డాడు. పుస్తకం పోయి దూరంగా పడ్డది, తలపోయి మంచం పట్టెకు కొట్టుకొంది అయినా ఆయనకు మెలుకువరాలా. తెల్లవారుజామునలేచి చూచుకొంటే ముఖాన బొప్పికట్టిఉంది.

రాజెన్‌బాబుకు విద్యాభ్యాసం ఇంటిలోనే ఆరవయేట మౌల్విసాహేబ్‌వద్ద జరిగింది. చిన్నప్పటినుంచి పర్షియన్ భాష శ్రద్ధాభక్తులతో చదివాడు. తరువాత హైస్కూలుచదువు ఛప్రాలో.

చిన్నప్పటినుంచి రాజెన్‌బాబు కష్టపడి చదివేవాడు పైగా తెలివితేటలు కూడా ఉన్నాయి. ఉపాధ్యాయులు ఆయన తెలివితేటలకు ఆశ్చర్యపడి సంవత్సరం మొదట్లోనే చదువుతున్న తరగతినుంచి పై తరగతికి ఒక్కసారిగా పంపించారు.

మహేంద్రప్రసాద్‌గారికి చిన్నప్పటి నుంచి దేశమన్నా, దేశపరిశ్రమలన్నా ఎంతో అభిమానం. ఈ అభిమానం తమ్ముడైన రాజేంద్రప్రసాద్‌లో కూడా నాటుకొనేటట్లు చేశాడు. అందువల్లనే ఖద్దరు ఉద్యమం బయలుదేరకపూర్వమే 1890 నుంచికూడా రాజెన్‌బాబు ఖద్దరు తప్ప మరొకటి కట్టేవాడుకాడు. స్వదేశ వస్తువులనే వాడేవాడు.

చిన్నతరగతులనుంచికూడా రాజెన్‌బాబు చదువులో తతిమ్మావిద్యార్థుల కంటే మిన్నగా ఉండేవాడు. స్కూలు ఫైనల్‌పరీక్షలో కలకత్తా విశ్వవిద్యాలయానికంతకు మొట్టమొదటివాడుగా నెగ్గాడు. రాజెన్‌బాబు తరువాత ఎఫ్. ఏ., బి. ఏ. అనన్ని కలకత్తాలో చదివాడు. విశ్వవిద్యాలయం పరీక్షలకు ఏ విద్యార్థులు కూర్చోటానికి అర్హులో నిర్ణయించటానికి ప్రత్యేకంగా పరీక్షలు జరిగేవి. వీటినే సెలెక్షన్ పరీక్షలు అంటారు. యఫ్. ఏ. సెలెక్షన్ పరీక్షకు, అనర్సు సెలెక్షన్ పరీక్షకు రాజెన్‌బాబు కూర్చు



న్నప్పుడు ఒకగమ్మత్తు జరిగింది.

యఫ్. ఏ. సెలెక్షన్ ఫలితాలు ప్రకటించటానికి ప్రిన్సిపాల్ స్వయంగా క్లాసుకు వచ్చాడు. తాను బాగా మార్కులు సంపాయించి మొదటివాడుగా పాసైనట్లు రాజెన్‌బాబుకు తెలుసు. అందువల్ల నిబ్బరంగా కూర్చున్నాడు. ప్రిన్సిపాల్ చదివినపేర్లలో రాజెన్‌బాబు పేరు రాలేదు. రాజెన్‌బాబులేచి, "నేను పాసయ్యాను, నాపేరు రాలేదేమి?" అని అడిగాడు. ప్రిన్సిపాల్ మండిపడుతూ, "నువ్వు తప్పి ఉంటావు. అందువల్లనే నీపేరు ఇందులో లేదు," అన్నాడు. "కాదండి, నేను పాసయ్యాను" అన్నాడు రాజెన్‌బాబు. "మళ్ళీ మాట్లాడావంటే అయిదురూపాయలు జరిమానా వేస్తాను" అన్నాడు ప్రిన్సిపాల్. తనపేరు లేదన్న ఆందోళనతో ఆయన మళ్ళీ మాట్లాడటానికి ప్రయత్నించాడు. ప్రిన్సిపాల్ "పదిరూపాయలు నీకు జరిమానా విధించాను," అన్నాడు. మళ్ళీ ఆయన ఏదో చెప్పబోయాడు. ప్రిన్సిపాల్ జరిమానాను 15 రూపాయలకు పెంచాడు. ఇలా జరిమానా పెరిగిపెరిగి 25 రూపాయలయింది. ప్రిన్సిపాల్ వెంటవచ్చిన గుమాస్తా రాజెన్‌బాబును ఎరుగును. అతడు వెనకనుంచి మాట్లాడవద్దని రాజెన్‌బాబుకు సైగచేశాడు. అప్పటికి ఆయన ఊరుకొన్నాడు. తరవాత విచారిస్తే గుమాస్తా పొరపాటునరాజెన్‌బాబు పేరు వదిలిపెట్టాడని తేలింది.

ఆయన కేవలం చదువుతోనే కూర్చోలేదు. బెంగాల్ విభజన ప్రతికూల ఉద్యమంలో పాల్గొన్నాడు. 1906 లో బీహార్ రాష్ట్రీయ విద్యార్థిసంఘాన్ని నెలకొల్పాడు. ఆ సంవత్సరంలోనే కలకత్తా అఖిలభారత సమావేశసందర్భంలో వాలంటీరుగా పనిచేశాడు.

తరువాత అయిదు సంవత్సరాలకే, అంటే 1911 లో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడయ్యాడు. ఆనాటినుంచి నేటివరకూ ఆ సభ్యత్వం ఆయనకు వస్తూనే ఉన్నది.






అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు పెద్దవాళ్ళసహాయం లేకుండా సొంతంగా ఆలోచించి ఈ పజిలు పూర్తి చేయాలి సుమా. అలా పూర్తిచేసి 33 పేజీలో ఉన్న జవాబుతో సరిచూసుకోండి. ఒక్క తప్పుకూడా లేకపోతే మీకు పది మార్కులు. ఒక తప్పుంటే ఆరు మార్కులు. రెండు తప్పులుంటే నాలుగు మార్కులు. మూడు తప్పులుంటే రెండుమార్కులు. నాలుగుగాని అంతకుమించిగాని తప్పులుంటే మాత్రం బండిసున్నా వచ్చినట్లే.

పోతే, దీన్ని పూర్తిచేసేపద్ధతి మీకు తెలుసునా? 1 నెంబరు అడ్డంలో మూడు అక్షరాలు వుండాలి. ఆధారములలో "ఒకరంగు" అని వుందా, దానికి మూడు అక్షరాల మాట ఏమైయ్యుండాలి అని ఆలోచించాలి. అప్పుడు "తెలుపు" వస్తుంది. అక్కడ "తెలుపు" ఉంచండి.



అలాగే 1 నెంబరు నిలువు రెండు అక్షరాలు వుండాలి, దానిని వెతకటానికి "ఒకజాతిలో భాగం" ఏదా అని చూడాలి. దాని మొదటి అక్షరం "తె"-యిది ఏమబ్బా అని ఆలోచిస్తే "తెగ" గుర్తుకు వస్తుంది. అట్లాగే తతిమ్మా గళ్లూ పూర్తిచేసి మీమార్కులు నాకుచెప్పండి.

## ఆధారములు

అడ్డము:

1. ఒక రంగు.
3. తీపివస్తువులపై వ్రాలును.
4. అక్షరముల వ్రాత.
6. తండ్రి తండ్రి.
8. అట్ట (తలక్రిందుగా)
10. దీనిపై వ్రాయవచ్చును.
11. నిద్రలో వచ్చునది.
13. ఒక పాము.
14. మీరొక్క
16. ఉష్ణత.
17. యుద్ధము.

నిలువు:

1. జాతిలో ఒక భాగం.
2. క్రూరజంతువు.
3. ఒక చెట్టు.
5. పక్షి.
6. ఒక రాక్షసి.
7. దీనితో వ్రాయవచ్చును.
9. పండ్రెండు అంగుళములు.
12. తీగ.
13. జ్వరమువచ్చినప్పుడు వైద్యుడు [చూచును.
15. యంత్రము.
16. ఒక చెట్టు.

---

55-వ పేజీలోని పొడుపు కథలకు జవాబు

1. అరటిపువ్వు; 2. ఎండ్రకాయ; 3. వీణ

## చందమామ
### పోటీవ్యాసం

ఈ నెల చందమామ పోటీ వ్యాసాలలో మొదటిబహుమతి 'ఆ రాత్రి' అనే కల్పనాకథకు ఇచ్చాము. దీనిని వ్రాసింది, యన్. జయ, రామారావుపేట, కాకినాడ.

ఈ కథ అక్టోబరు చందమామలో ప్రకటిస్తాము. రెండు, మూడు బహుమతులు నిర్ణయంకూడా వచ్చేసంచికలో ప్రకటిస్తాము.

సంచాలకుడు

**చందమామ**

---



# చందమామకు

## ప్రతి ఊళ్లో ఏజంట్లు కావాలి

★ భావిభారతం నేటి పిల్లలమీద అధారపడి ఉంది. వారి విజ్ఞానంమీదనే వారి సాహస త్యాగాలమీదనే భారతభవిష్యత్తు నిర్ణయింపబడుతుంది కాబట్టి పిల్లలను విజ్ఞానవంతులను సాహసులను, త్యాగులను చేయవలసినభారం పెద్దలమీదా ప్రభుత్వముమీదా ఉన్నదీ.

★ అందుచేతనే బడిలేని ఊరులేదు. పిల్లలులేని బడిలేదు. చందమామ కోరని పిల్లవాడు లేదు.

★ చందమామ పిల్లల పత్రిక, చందమామ చదివిన పిల్లవాడివిషయమై ప్రభుత్వంగాని, తలిదండ్రులుగాని ప్రత్యేక శ్రద్ధ తీసుకో నవసరంలేదు. అది చందమామే తీసుకుంటుంది.

★ అయితే చందమామను పిల్లలకు ప్రతిగ్రామంలో అందించే పరోపకారి ఒకరు కావాలి. వారు ఈ పరోపకారంకోసం ఎక్కువ సమయం వృధాపరచ నక్కరలేదు, డబ్బు దండుగ పడ నవసరంలేదు, ఇంటివద్ద కూర్చుండి నెలకు 10, 12 కాపీలు అమ్మి కొద్ది లాభంతో ఈ విద్యాదానం చేయవచ్చును. కాబట్టి ప్రతివారు ఈ పరోపకారం చేయండి.


# చందమామకు

## ప్రతి ఊళ్లో ఏజంట్లు కావాలి


వివరాలకు వ్రాయండి.

మేనేజరు: చందమామ
37, ఆచారప్పన్‌వీధి జి. టి. మద్రాసు, 1.



Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editor: CHAKRAPANI



*Chandamama Sept. '47* *Photo by N. Bhaskar*

"నాకూ తెలుసులే ........!"